THE ANDHRA PATRIKA - MADRAS.

పరిపాలనా వ్యయం తగ్గించడానికి ప్రజా సభలో సూచన —4 వ పేజీ

# ఆంధ్రపత్రిక

6 పేజీలు వెల 1 అణా. హాలీ 0-1-2.

గ్రామస్థులు తమ స్కూలు భవనాలను తామే స్వయంకృషితో నిర్మించాలి —5 వ పేజీ

318491

Regd. No. M. 1118 సంపుటం 39. సంచిక 339 FOUNDER : DESODHARAKA K. NAGESWARA RAO. శనివారము 14-3-1953

# 'మద్రాసులో ఆంధ్ర రాజధాని ఏర్పాటుకు నగర భవిష్యత్తు గురించిన

# ఆందోళనే అవరోధం'

## రాష్ట్ర ముఖ్యమంత్రి అభిప్రాయం

### నిర్మాణ కార్యక్రమాల నిలుపుదల రాష్ట్ర విభజన వల్ల కాదని వివరణ

### గవర్నర్ ప్రసంగంపై చర్చకు రాజాజీ జవాబు: ధన్యవాద తీర్మానానికి అసెంబ్లీ ఆమోదం

మద్రాసు, మార్చి 13: "భారతదేశ ప్రస్తుత పరిస్థితులలో భాషారాష్ట్ర విభజన అత్యవసరమైన సమస్య కాదని నా దృఢమైన అభిప్రాయం. భాషారాష్ట్రాల నిర్మాణంవల్ల సమస్యలు పరిష్కారం కావు," అని ముఖ్యమంత్రి రాజగోపాలాచారిగారు అసెంబ్లీలో గవర్నరు ప్రసంగంపై జరిగిన చర్చకు సమాధానం ఇస్తూ నేడు అన్నారు.

ఆంధ్రరాష్ట్రం ఏర్పడబోతున్న కారణంచేత, నిర్మాణ కార్యక్రమాలను నిలిపివేయడం జరిగిందనే ఆరోపణ సరి అయినది కాదనీ, భవిష్యత్ రాష్ట్రాలు నిర్ణయించవలసిన విషయాలను మాత్రమే వాయిదా వేయడం జరుగుతుందనీ కూడా రాజాజీ సభికులకు తెలియజేశారు. మద్రాసులో ఆంధ్రరాష్ట్ర తాత్కాలిక రాజధాని ఎందుకు వుండకూడదో మరొకసారి వివరించారు.

గవర్నరుకు ధన్యవాదాలు అర్పిస్తూ అనంతశాయి గారు ప్రతిపాదించిన తీర్మానానికి సభవారు ఆమోదించారు. సవరణ ప్రతిపాదన అనుకూలంగా 95 వోట్లు, ప్రతికూలంగా 160 వోట్లు వచ్చి వీగిపోయింది.

ఉపసంహరించుకోని సవరణలను ఓటుకు పెట్టి వీగిపోయినట్లు స్పీకరు ప్రకటించారు. శ్రీ పి. రామమూర్తి గారి సవరణను చదివి స్పీకరు ఓటుకు పెట్టి వీగిపోయినట్లు ప్రకటించారు దానిమీద ప్రతిపక్షంవారు పోల్ కోరారు.

కవున్సిల్ సభ్యులయిన ముఖ్యమంత్రి శ్రీ రాజగోపాలాచారి, శ్రీ రంగారెడ్డిగార్లు స్పీకరు వేదికమీద ఏర్పాటుచేసిన స్థానాల్లో కూర్చున్నారు.

సవరణకు అనుకూలముగ 95 వ్యతిరేకముగ 160 మంది ఓటు చేశారనీ ఒకరు తటస్థంగ వున్నారని సవరణ వీగిపోయిందని ప్రకటించి శ్రీ టి. అనంతశాయి గారు ప్రతిపాదించిన ధన్యవాద తీర్మానమును ఓటుకు పెట్టి నెగ్గినట్లు సభ్యుల హర్షధ్వానముల మధ్య ప్రకటించి సభను 14 తేదీ సాయంత్రం 4-30 గంటలకు వాయిదా వేశారు.

#### ముఖ్యమంత్రి సమాధానం

ముఖ్యమంత్రి శ్రీ సి. రాజగోపాలాచారి చర్చకు సమాధానం ఇస్తూ ఇట్లా అన్నారు. "ప్రతిపక్ష నాయకుడు చెప్పిన విషయాలు చాలవరకు రాష్ట్ర పరిపాలనకు సంబంధించినవి కావు. ఒకటి రెండు విషయాలు తప్ప అన్నీ కేంద్ర పార్లమెంటు, కేంద్ర ప్రభుత్వానికి సంబంధించినవున్నాయి. పంచవర్ష ప్రణాళికగురించి ఇక్కడ ఏమీ చెప్పలేను. కేంద్రం తయారు చేసింది. ఇక్కడ మనం అమలు జరపవలసివుంది. క్షామంగురించీ, ధరల తగ్గుదల, పెరుగుదలగురించి మాట్లాడారు. ప్రతిపక్ష నాయకుడు ఇక్కడ ముఖ్యమంత్రో, కేంద్రంలో ప్రధానమంత్రో అయి ఎట్లా కంట్రోలు చేస్తారో చూడవలసి వుంది. ఏమైనా అవన్నీ అప్రస్తుతములు. ఇది బడ్జెటు చర్చకూడా కాదు. గవర్నరు ప్రసంగం గురించిన చర్చ

(2-వ పేజీ చూడుడు)

### ఇండో చైనాకు జపాన్ ఆయుధాలు

#### యుద్ధపరిహారంగా ఇవ్వాలని మాజీ ఫ్రెంచి ప్రధాని రీనో ప్రతిపాదన

టోకియో, మార్చి 12: జపాను యుద్ధనష్ట పరిహారం క్రింద ఇండో చైనాలో పోరాడుతున్న ఫ్రెంచి సేనలకు ఆయుధాలు సరఫరా చెయ్యాలని మాజీ ఫ్రెంచి ప్రధాని పాల్ రీనో నేడిచ్చట వ్యక్తం చేశారు.

ఇండో చైనాలో 57వేట్ నాం బెటాలియన్‌లను నిర్మించాలని, ఫ్రెంచివారు వేస్తున్న పథకాలు పూర్తి అయితే, అచ్చటవున్న ఫ్రెంచి సైన్యాలను ఐరోపాకు తరలించడం సాధ్యం అవుతుందని గూడా ఆయన అన్నారు.

మాజీ ఫ్రెంచి ప్రధాని వ్యక్తంచేసిన, ఈ రిపరేషన్ల చెల్లింపు పద్ధతికి జపాను వ్యాపారస్థులు ఎంతగానో అనుకూలంగా లేరు. ఫ్రాన్సుకు సరాసరి అయితే ఆయుధాల ఎగుమతి చెయ్యడానికి మాకు ఎటి అభ్యంతరము లేదు. అయితే ఈ బేరాలన్నీ రొఖ్ఖం చెల్లిస్తేనే జరుగుతాయి అంటున్నారు.

జపాను విదేశాంగశాఖ ఉద్యోగులు గూడా పాల్ రీనో ఈ సూచనపట్ల ఆశ్చర్యాన్ని వెల్లడించారు ఈ నష్టపరిహారాన్ని ఏవిధంగానైనా చెల్లించుకో వచ్చుగాని, ఆయుధాలు ఇచ్చి చెల్లుబాటు చేసుకోవడం ఇంతవరకు ఎక్కడా లేదని వీరి భావంగా తోస్తున్నది.

### 'తాత్కాలిక రాజధానిని కేంద్రమే నిర్ణయిస్తుంది'

#### నీలం సంజీవరెడ్డిగారి ప్రకటన: సాధ్యమైనంత త్వరలో రాష్ట్రం నిర్మించాలని నెహ్రూ సంకల్పం

మద్రాసు, మార్చి 13 "ఆంధ్రుల తాత్కాలిక రాజధాని ఎక్కడ ఉండటమన్నది ఇంకా నిర్ధారణ కాలేదు. మద్రాసులోనే ఉండాలని గట్టిగా మనం చెప్పాము ఉండరాదని తమిళులు అన్నారు. దీనిపై నిర్ణయం కేంద్ర మంత్రివర్గం చెయ్యవలసిఉంది," అని ఆంధ్రప్రదేశ కాంగ్రెసు అధ్యక్షులు నీలం సంజీవరెడ్డిగారు ఇవాళ ఢిల్లీనుంచి విమానంలో వచ్చాక, ఆంధ్రపత్రిక ప్రతినిధితో చెప్పారు.

కేంద్ర మంత్రివర్గం ఆంధ్రులకు న్యాయం చేస్తుందనే ధైర్యంతో ఉండటంకన్న చెయ్యవలసింది లేదని సంజీవరెడ్డిగారు అన్నారు. "చెయ్యకపోతే ఎక్కడ" అనగా "ఆ ప్రశ్న ఇప్పుడు రాదనీ, మనం చెప్పేవది న్యాయమైనప్పుడు మనకు న్యాయం చేకూరుతుందని నిర్ణయం జరిగేవరకూ ఆశించవలసిందే" అన్నారు.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణం ఎప్పుడు జరుగుతుందనగా భారత ప్రధాన మంత్రి సాధ్యమైనంత త్వరలో నిర్మాణం చేయాలనే సంకల్పంలో ఉన్నారని సంజీవరెడ్డిగారు అన్నారు.

రాజగోపాలాచారిగారు అడ్డంకులు అంటున్నారు ఏమిటని అడగ్గా వారు ఎందుకు చెప్పారో తనకు తెలియదని సంజీవరెడ్డిగారు అన్నారు.

#### నాయకుని ఎన్నిక

రాష్ట్రం ఎప్పుడువచ్చేది నిర్ధారణ లేకుండానే శాసనసభల ఆంధ్రకాంగ్రెసు పక్షనాయకుని ఎన్నిక ఎందుకని అడగ్గా ఆంధ్రరాష్ట్ర నిర్మాణము సందర్భములో అనుదినమూ వచ్చే సమస్యల చర్చించి వ్యవహరించేందుకు అవసరమని సంజీవరెడ్డిగారు సమాధానమిచ్చారు. ఆస్తి అప్పుల పంపకం, ఇక మత్స్య సాధన మున్నగు వాటన్నిటిపైనా ఆంధ్రులపక్షాన వ్యవహరించేవారొకరు ఉండటం అవసరం గనుక నాయకుని ఎన్నిక జరుగవలెననీ, ఆ ఎన్నిక ఏకగ్రీవంగా ఉండగలదనీ ఆశిస్తున్నామనీ సంజీవరెడ్డిగారు బదులు చెప్పారు.

"శాసనసభల ఆంధ్ర కాంగ్రెసు పక్షం రాష్ట్రకాంగ్రెసు నిర్ణయాలకు భిన్నంగా తీర్మానాలుచేసే హక్కు కలిగి ఉన్నదా?" అని ప్రశ్నించగా సంజీవరెడ్డిగారు ఇల్లా అన్నారు:

"ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసుకు భిన్నముగా వారేమీ చేశారని నేను అనుకోవడంలేదు. అనేక పక్షాలుగా ఉన్న ఆంధ్రశాసనసభలో స్థిరమైన ప్రభుత్వం సాధ్యమైతే ఎవ్వరికీ అభ్యంతరం లేదు సాధ్యంగానివాడు కొత్తగా ఎన్నికలు జరుపవలెననే రాష్ట్రకాంగ్రెసు కోరినది.'

#### కృషికార్ లోక్ పార్టీతో సంప్రదింపులు

కృషికార్ లోక్ పక్షంతో సంప్రదింపులు విరమించబడ్డాయనని కాంగ్రెసు కార్యదర్శి ప్రకటించారుగదా అవి ఏ స్థితిలో ఉన్నవనగా సంజీవరెడ్డిగారు ఇల్లా అన్నారు "అప్పటికి విరమించబడినవి. తర్వాత రంగాగారు నెహ్రూగారిని చూడటంతో మళ్లీ ప్రారంభమైనవి. అవి జరుగుతున్నవి."

ప్రకాశంగారు రేపు మద్రాసుకు చేరగలరని అనుకుంటున్నామనీ, వారితో గూడా పరిస్థితులు చర్చించవలసి ఉంటుందన్నారు మద్రాసు మంత్రివర్గంలోని ఆంధ్ర మంత్రులను, శాసన సభ్యులను ఇవాళ కలుసుకోగలమన్నారు. నాయకుడైనవారే ముఖ్య మంత్రి కావవసరంలేదనీ, దాని సంగతి రాష్ట్రం వచ్చాక, ఇతర పక్షాలతో ఏకీభావ సాధనకు యత్నాలు జరిగాక ఆలోచించవచ్చుననీ మరో ప్రశ్నకు సమాధానమిచ్చారు.

స్థానిక శాఖామంత్రి నాయకంటి శంకరరెడ్డి, విద్యామంత్రి మల్లవరపు కృష్ణారావు, కడప కోటిరెడ్డి మరికొందరు శాసన సభ్యులు శ్రీ సంజీవరెడ్డిగారిని కలిసి మాట్లాడారు.

#### కామరాజనాడార్ ప్రకటన

మద్రాసు, మార్చి 13: మద్రాసు తాత్కాలికంగా గూడా ఆంధ్ర రాజధానిగా ఉండటం సాధ్యపడేట్టు లేదని తమిళ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ. కామరాజనాడారుగారు నేడు ఆంధ్రపత్రిక ప్రతినిధితో అన్నారు. కేంద్రమంత్రివర్గం నాల్గయిదు రోజుల్లో నిర్ణయం చెయ్యగలదన్నారు.

ఈ నెల 11 వ తేదీనాడు న్యూఢిల్లీలో జరిగిన శాస్త్రీయ, పారిశ్రామిక పరిశోధనల సమితి తొలునాటి పాలక సంఘ సమావేశానికి ప్రధాని జవహర్లాల్ నెహ్రూ అధ్యక్షత వహించారు.

## తూర్పు జర్మనీ సరిహద్దున బ్రిటిష్ విమాన విధ్వంసం

### బెర్లిన్‌లోని రష్యన్ అధికారులకు అధిక్షేపణ అందజేయవలసిందని చర్చిల్ ఆదేశం

లండన్, మార్చి 12. తూర్పు జర్మనీ సరిహద్దుల దరిదాపుల్లో బ్రిటిష్ మండలం తాలూకు భూభాగంమీదగా ఎగురుతున్న ఒక బ్రిటిష్ లింకన్ బాంబరు విమానాన్ని రష్యన్ విమానాలు కూల్చినట్లు నేడు బ్రిటిష్ విదేశాంగ శాఖవారు ప్రకటించారు. ఈ విషయమై బెర్లిన్‌లోని రష్యన్ అధికారులకు తీవ్రమైన అసమ్మతిని, ఆక్షేపణను తెలియపరచవలసిందిగా బ్రిటిష్ ప్రధాని చర్చిల్ విదేశాంగ శాఖవారికి ఉత్తర్వులు పంపారు.

పశ్చిమజర్మనీ, తూర్పుజర్మనీ సరిహద్దుల్లో ఎక్స్‌వడీతీరాన బ్రిటిష్ మండలంలో వున్న బ్లికెడీ అనే ప్రదేశంవద్ద ఈ పని జరిగింది. కొన్ని సోవియట్ "మిగ్" విమానాలు ఈ బ్రిటిష్ బాంబరును చుట్టుముట్టి కాల్పులు సాగించాయి. ఈ కాల్పులు సాగించడాన్ని చాలామంది జనము, పశ్చిమజర్మనీ సరిహద్దు రక్షకులు అంతా చూచారు. బ్రిటిష్ బాంబరులోని వైమానికులు మొత్తం ఏడుగురిలో ఐదుగురు పారాషూట్ల సహాయంతో క్రిందకు దూకినట్టు వార్తలు వచ్చాయి. ఇందులో ఇద్దరు సరిహద్దులకు ఇటువైపున, ఇద్దరు అటువైపున పడ్డారు. ఇటువైపున పడ్డవారిలో ఒక వైమానికుడు న్యూవంబర్గ్ ఆస్పత్రిలో చనిపోయాడు. ఇతని వంటిమీద మరఫిరంగిగుండ్లు తగిలిన గాయాలు వున్నట్లు ఆ ఆస్పత్రి సర్జన్ ప్రకటించారు.

ఈ విషయమై బెర్లిన్‌లోని రష్య

(6 వ పేజీ చూడుడు)

### రక్షణ శాఖ మంత్రిగా మహావీర్ త్యాగి

#### క్యాబినెట్ హోదాలేని పదవి: సోమవారంనాడు స్వీకారం

న్యూఢిల్లీ, మార్చి 13: ప్రస్తుతం రెవెన్యూ మంత్రిగావున్న మహావీర్ త్యాగిగారు సోమవారంనుంచి రక్షణ శాఖామంత్రిగా వ్యవహరిస్తాడు. అయితే త్యాగిగారికి పూర్వంలాగానే కాబినెట్ హోదా వుండదు కాబినెట్ హోదాగల శాశ్వతమంత్రి ఒకరు నియమించబడే వరకు, ప్రధాన మంత్రి పండిట్ నెహ్రూయే ఈ రక్షణశాఖ వ్యవహారాలను పైనవుండి పర్యవేక్షిస్తూ వుంటారు.

రక్షణశాఖామంత్రిగా నియమించడానికి అర్హుడైన వ్యక్తికోసం ప్రధాన మంత్రి యింకా అన్వేషణ సాగిస్తూనే వున్నారు త్యాగిగారు నిన్న టిరోజున ఆర్థికశాఖ ఉద్యోగులందరివద్ద సెలవు తీసుకున్నారు. (స్వ. వి.)

## పెప్సూలో అధ్యక్షపాలన: ప్రజాసభ ఆమోదం

### చర్య అవసరమైన పరిస్థితులపై హోంమంత్రి కట్జూ వివరణ

న్యూఢిల్లీ, మార్చి 12: పాటియాలా తూ. పంజాబు సంస్థానాల సమాఖ్య పరిపాలనను స్వాధీనం చేసుకొంటూ రాష్ట్రపతి చేసిన ప్రకటనను ప్రజాసభ నేడు ఆమోదించింది

ఈ సందర్భమై హోం మంత్రి డాక్టర్ కైలాసనాథ కట్జూ ప్రతిపాదించిన తీర్మానాన్ని చర్చానంతరం ఓటుకు పెట్టవలసి వచ్చింది. 208 ఓట్లు అనుకూలంగానూ 60 ప్రతికూలంగానూ వచ్చాయి.

దీనికి ఉపపాదింపబడిన సవరణలలో పండిట్ ఠాకూర దాస్ భార్గవ ప్రతిపాదించినవితప్ప మిగతావన్నీ తిరస్కరించబడినాయి.

తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ ఇట్లా అన్నారు: ఈ రాష్ట్ర పరిపాలనను రాష్ట్రపతి చేగొనడం అక్కడ కాంగ్రెసుకు అనుకూల్యం కలిగించటానికి కాదు, ఈ చర్య ఈ రాష్ట్రాన్ని పంజాబులో కలిపివేసేందుకు మొదటి మెట్టూ కాదు. కేవలం ప్రజల యోగక్షేమాల సంరక్షణ నిమిత్తమే ఈ చర్య తీసుకొన్నాము. ఉన్న కుళ్ళును కడిగివేసి, ప్రజలలో 'ఇక భయంలేదు' అన్న భావం కలిగించడానికే ఈపని చేశాము. నియోజకస్థానాల నిర్ణయసంఘం పని పూర్తికాగానే సక్రమమైన ఎన్నికలు జరుపుతాము. ఇప్పటిది అజమాయిషీ

(2 వ పేజీ చూడుడు)

## ఆంధ్రరాష్ట్రానికి అన్నివిధాలతగిన రాజధానీనగరం హైదరాబాద్

### కర్నాటక కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ నిజలింగప్పగారి అభిప్రాయం

బెంగుళూరు, మార్చి 12: హైదరాబాదు సంస్థానాన్ని విభజించి ఆయా ప్రాంతాలను ఆయా భాషా రాష్ట్రాలతో కలిపినట్లయితే ఆంధ్ర, కర్నాటక, మహారాష్ట్ర భాషాధారిక రాష్ట్రాలను ఏర్పరచడం సులభ సాధ్యం కాగలదని ఏర్పడనున్న ఆంధ్ర రాష్ట్రానికి హైదరాబాదు నగరం చక్కటి రాజధాని అవుతుందనీ కర్ణాటక ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు ఎస్. నిజలింగప్పగారు ఈవేళ పత్రికా విలేఖరుల సమావేశంలో అన్నారు. ఆ సందర్భంలో ఆయన ఇంకా యిలా అన్నారు:

"సరిహద్దులు, అప్పులు, ప్రభుత్వ శాఖలు మొదలయిన వాటి పరిశీలనకు కేంద్ర ప్రభుత్వం ఒక సంఘాన్నిగాని లేక కొన్ని సంఘాలనుగాని నియమించాలి. ఇలా చేసినట్లయితే భాషాధారిక రాష్ట్రాల సమస్య పరిష్కారం సులభసాధ్యమై, ప్రజలలో విశ్వాసం పెంపొందగలదు.

"బళ్ళారి జిల్లాను నవ్యాంధ్రలో చేర్చడానికి ఆ జిల్లాలోని ప్రజలు సుముఖంగా లేరు. ఆ జిల్లా తమ రాష్ట్రంలో వుండవలెనని కోరిన మద్రాసు రాష్ట్రంవారికి ఇష్టంలేకపోయినట్లయితే తమ ప్రాంతం మైసూరు సంస్థానంలో కలవాలని బళ్ళారి జిల్లావాసులు కోరుతున్నారు. కర్ణాటక, ఆంధ్ర ప్రతినిధుల సమావేశం సంప్రదింపులు జరిపి బళ్ళారి జిల్లాలోని వివాద గ్రస్థ తాలూకాల సమస్యను సులభంగా పరిష్కరించగలమనే నా విశ్వాసం.

"ఆంధ్ర రాష్ట్ర విషయంలో ఆ ప్రాంతంలోని వివిధ వర్గాల మధ్యవున్న ఏకీభావంకంటే కర్ణాటక రాష్ట్రం విషయంలో ఇక్కడి విభిన్న వర్గాల మధ్య ఎక్కువ ఏకీభావం కలదు ఒక రాష్ట్రం ఏర్పరచే విషయంలో భాషఒక్కటే పరిశీలించదగు విషయం కాదు. పరిపాలనా సౌకర్యం, ఆయా ప్రాంతాలలోని ప్రజల భావాలను కూడా గమనించాలి."

#### కర్ణాటక యువజన పరిషత్ అభ్యర్థన

బళ్ళారిజిల్లాను, అనంతపురం జిల్లాలోని మడకసిర, కళ్యాణదుర్గం తాలూకాలను ఆంధ్ర రాష్ట్రంలో చేర్చవద్దని విజ్ఞప్తి చేస్తూ కర్ణాటక యువజన పరిషత్తు కార్యదర్శులు ప్రధాని నెహ్రూకు ఒక తంతి పంపించారు. అలా కలిపినట్లయితే మున్ముందు విపరీత పరిణామాలేర్పడగలవనీ, ఆ ప్రాంతాలలో కన్నడిగులు మాటాడేవారే ఎక్కువ మందున్నారని ఆ తంతి వార్తమానంలో వున్నది. (పి. టి. ఐ.)

## విజయవాడ మున్సిపల్ బడ్జెట్‌లో 7 లక్షలకు పైగా మిగులు

విజయవాడ, మార్చి 12: ఈ పురపాలక సంఘం తాలూకు 1953-54 సంవత్సరపు బడ్జెట్ అంచనాలలో, 7.37 లక్షల రూ.లు మిగులు కన్పించింది. అంచనా వేయబడిన ఆదాయం అన్ని పద్దులక్రింద 55.49 లక్షలు ఖర్చు 48.12 లక్షలు.

ఈ బడ్జెట్ అంచనాలను నిన్న పురపాలక సంఘ సమావేశంలో ప్రతిపాదించగా స్వల్ప సవరణలతో పురపాలక సంఘంవారు ఆమోదించారు.

పురమందిర నిర్మాణానికి, మంచినీరు మరుగుదొడ్లకు, అవసరంగా మున్సిపల్ ... చేయాలని, ... పన్నులో వాటా ఎక్కువ చేయాలని పురపాలక సంఘంవారు ప్రభుత్వాన్ని అర్థించారు.

## నాగజాతి సమస్య

### బర్మా భారత దేశ ప్రధానులు పరిశీలించే అవకాశం

రంగూన్, మార్చి 12: ఈ మాసాంతాన ఇండియా బర్మాల సరిహద్దున ఉభయ దేశాల ప్రధాన మంత్రులు సమావేశమై నాగజాతి ప్రజల సమస్యలను గూర్చి చర్చిస్తారు.

ఈ సమావేశంలో చర్చలకు నిర్దిష్టమైన ప్రణాళిక అంటూ ఏదీ తయారు చేయబడలేదు. బర్మా ప్రధాన మంత్రి నూ మార్చి 28 వ తేదీన రంగూన్‌లో బయలుదేరి కొన్ని సరిహద్దు ప్రాంతాలను చూచుకొని అక్కడినుంచి పండిట్ నెహ్రూను కలుసుకోడానికి విమానంమీద 28 వ తేదీన ఇంఫాల్ వస్తారు. ఆతర్వాత వీరు ఇరువురు కలిసి సరిహద్దు ప్రాంతాలలో కొన్ని రోజుల పాటు పర్యటన జరుపుతారు.

నాగజాతిప్రజలు ఇండియా తూర్పు సరిహద్దున 500,000 మందీ, బర్మా పశ్చిమోత్తర సరిహద్దు ప్రాంతంలో 70 వేల మందీ వున్నారు. ఇండియాలోని నాగజాతి ప్రజల నాయకుడు, సరిహద్దు కిరువైపులా వున్న నాగజాతి ప్రాంతాలతో ఒక ప్రత్యేకమైన రాజ్యాన్ని ఏర్పాటు చేయాలని ఆందోళన జరుపుతున్నాడు ఇది ఇలా వుండగా, బర్మాలోని నాగజాతి నాయకులు మధ్యమధ్య ఇండియాలోని నాగజాతి ప్రాంతాలపై దండయాత్రలు చేయడం కూడా వుంది. నాగజాతి నాయకులను అంకెకుతీసుకురావడానికి బర్మా ప్రభుత్వం ఆమధ్య సరిహద్దు ప్రాంతాలకు ఒక సైనికదళాన్ని పంపించింది.

నాగజాతి ప్రజలు ఆర్థికంగా చాలా దుస్థితికి లోనైవుండడం, రాకపోక సౌకర్యాలు ఏమీ లేకపోవటం, వీటితో ఈ ప్రాంతాలలో అశాంతి సంక్షోభాలు హెచ్చిపోతున్నాయి.

బర్మాలో నాగజాతిప్రజల స్థితి కంటే ఇండియాలోని నాగజాతి ప్రజలస్థితే కొంతనయం. బర్మాలోని నాగజాతి నాయకులుకూడా కొందరు ప్రత్యేకరాజ్యం కావాలనే ఆందోళనను బలపరుస్తున్నారు. నాగజాతి ప్రజల స్థితిగతులను అభివృద్ధి చేయడానికి 2½ లక్షల రూ. ఖర్చుతో కూడిన కార్యక్రమం ఒకటి బర్మా ప్రభుత్వం ఇటీవల ప్రకటించింది. దీనితో ఈ ప్రాంతాలలో ప్రత్యేక రాజ్యం కోసమై జరుగుతున్న ఆందోళన ఇప్పుడు కొంత తగ్గింది.

బర్మా ప్రధాని నూ పండిట్ నెహ్రూతో సరిహద్దు ప్రాంతాల సమస్యలను గురించేకాకుండా బర్మా సరిహద్దులలోని చైనా జాతీయ సైన్యాల విషయంకూడా చర్చించగలరని తెలుస్తున్నది.

ఈసంభాషణలలో బర్మాలోని భారతీయ రాయబారి శ్రీ కె. శ్రీ చెట్టూర్ గారు కూడా పాల్గొంటారు.

ఐక్యరాజ్య కార్యాలయవ, మార్చి 12. కాల్వనీటి పంపకం తగాదాను గురించి తాము ఐక్యరాజ్య సమితికి ఫిర్యాదు చేశామనే వార్తలు అయదార్థాలని పాకిస్తాన్ ఈ వేళ ప్రకటించింది కాల్వనీటి పంపకం విషయమై ఇండియా పాకిస్తానుల మధ్య ప్రస్తుతం సంప్రతింపులు జరుగుతున్నాయనీ పాకిస్తాన్ భవిష్యత్ కార్యక్రమం ఆ సంప్రతింపుల పర్యవసానం మీద ఆధారపడి వుంటుందనీ, ఆ ప్రకటనలో వివరించబడింది.

## కొరియాలో సమితి సేనలకు మందుగుండు సామగ్రి కొరత

### వాన్‌ఫ్లీట్ ఫిర్యాదుపై విచారణకు నిర్ణయం

వాషింగ్టన్, మార్చి 12: కొరియాలో ఐక్యరాజ్యసైన్యాలకు మందుగుండుసామానుసప్లయిలు సరిగా అందటములేదనీ, ఒకానొక సందర్భంలో ఈ సామగ్రికి తీవ్రమైన కొరతపడి సైన్యాలు చాలా చిక్కుపడవలసి వచ్చిందనీ, మాజీ ఐక్యరాజ్య సేనాని జనరల్ జేమ్సు వాన్‌ఫ్లీట్ ఇటీవల చేసిన ఫిర్యాదును గురించి దర్యాప్తు జరిపించడానికి సెనేట్ సాయుధసైన్యాల కమిటీ ఈ వేళ తీర్మానించింది.

వాన్‌ఫ్లీట్ చేసిన ఈ ఆరోపణకు తగినంత ఆధారమున్నట్లుగా కమిటీ అభిప్రాయపడింది

సైన్యాలకు మందుగుండు సామగ్రి సప్లయిలు సరిగా అందకపోవడానికి ఎవరు కారకులో విచారించి వారిని గట్టిగా శిక్షించాలని డెమాక్రాట్ ప్రతినిధి సెనేటర్ హారీ బర్డ్ కమిటీ సమావేశంలో హెచ్చరిక చేశాడు.

ఈ ఫిర్యాదునుగూర్చి దర్యాప్తు జరపడానికి అయిదుగురు సభ్యులతో కూడిన సబ్ కమిటీ ఒకటి నియమించబడుతుంది.

కొరియాలోని మాజీ బ్రిటిష్ సర్వసేనాని లెఫ్టినెంట్ జనరల్ విలియమ్ బ్రిడ్జ్ ఫర్డ్ నేటిరాత్రి కామన్సు రాలో పార్లమెంటు సభ్యులలో ప్రసంగిస్తూ, "కొరియా యుద్ధంలో ఐక్యరాజ్య సైన్యాలు గెలవటం యిక దుర్లభమనీ, యుద్ధవిరమణ రాయబారాలు అవకాశంగా తీసుకొని కమ్యూనిస్టులు ఈ 18 నెలలలో తమబలాన్ని ఎన్నోరెట్లు పెంచుకున్నారనీ, తెలియజేసినట్లు 'పిక్చర్ పోస్ట్' అనే వారపత్రిక ప్రకటించింది.

ఐక్యరాజ్య సైనికాధికారులు కమ్యూనిస్టులతో రాయబారాలు జరుపుతున్న పద్ధతి ఏమాత్రం సంతృప్తికరంగా లేదని ఆయన విమర్శించి నట్లుకూడా తెలుస్తున్నది.

## భారతీయ విశ్వవిద్యాలయాలలో కమ్యూనిస్టు ప్రాబల్యమున్నదట

### —శాండర్స్ రీడింగ్ ఆరోపణ

న్యూయార్కు, మార్చి 12: ఇండియాలో విశ్వవిద్యాలయాల్లో పట్టాలు పుచ్చుకుంటున్న విద్యార్థులలో 100 కి 75 మంది కమ్యూనిస్టుపార్టీ విధానాలను అనుసరించేవారేనని సాండర్స్ రీడింగు అనే ఆయన నేడిచ్చట వెల్లడిచేశారు. ఈయన హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో ఇంగ్లీషు ప్రొఫెసరు. ఇండియాలో 8 నెలలపాటు పర్యటనచేసి అమెరికా చేరుకున్నారు.

ఇండియాలో ప్రజాస్వామ్యానికి విరోధంగా మూడు ముఖ్యవిషయాలు పనిచేస్తున్నాయని, అవి (1) విశ్వవిద్యాలయాలలో కమ్యూనిస్టులు స్థావరం సంపాయించుకోవడం (2) ప్రభుత్వం ఈ విషయాన్ని ఉపేక్షగా చూస్తూవుండటం (3) అమెరికా అంటే ద్వేషం పెరుగుతుండటం అని ఆయన చెప్పారు.

## గంటల పంచాంగం

నందన సం॥ ఫాల్గుణ బ॥ చతుర్దశి
1953 సం॥ మార్చి 14 శనివారం
బ॥ చతుర్దశి రా 8-21 శత రా 10-37
వర్జ్యం ఉ 7-51 ల 9-15కు. రా వర్జ్యం తె 4-14 ల 5-38.
బ॥ అమావాస్య మార్చి 15 ఆదివారం
ఆ॥ అమావాస్య సా 4-35 పూర్వాభా రా 7-37
వర్జ్యం తె 4-4 ల 5-28 కు.

ఆంధ్రపత్రిక

ఒరు లేయని యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్. (మహాభారతము)

నందన సం॥ ఫాల్గుణ బ॥ చతుర్దశి
శనివారం

## హైదరాబాద్ బడ్జెట్

దక్షిణాదినవున్న మూడు 'బి' తరగతి రాష్ట్రాల్లోనూ హైదరాబాదు రాష్ట్ర ఆర్థిక స్థితే కొంత తృప్తికరంగా వున్నట్లు కన్పిస్తుంది. 1953-54 సంవత్సరంలో మైసూరుకు 2,062 లక్షల రూపాయిలు, తిరువాన్కూరు-కొచిన్ రాష్ట్రానికి 1,713 లక్షల రూపాయిలు ఆదాయం ఉండగలదని అంచనా వేయబడింది. ఈ రెండు రాష్ట్రాల్లోనూ ఖర్చులు ఆదాయాన్ని మించే వున్నవి. మైసూరు రాష్ట్రానికి వచ్చే ఆర్థిక సంవత్సరంలో 157 లక్షల రూపాయిల లోటు వుంటుందని అంచనా వేస్తే, తిరువాన్కూరు కొచిన్‌కు 14 లక్షల రూపాయిల లోటు వుంటుందని అంచనా వేయబడింది. హైదరాబాదు బడ్జెట్ లోనూ 32 లక్షల రూపాయిల లోటు వుంది. చెరుకుపై ఎక్సయిజు పన్నును విధించి, పెట్రోలు, మోటార్లపై ప్రస్తుత పన్నును ఎక్కువచేసి రాష్ట్ర ఆర్థికమంత్రి ఈ లోటును 20 లక్షల రూపాయిలకు తగ్గించారు. రాష్ట్రఆదాయం 2,801 లక్షల రూపాయిలు వుంటుందని అంచనా వేస్తే ఈ లోటు అంత ప్రమాదకరమైనదికాదు. రాష్ట్ర ఆర్థికమంత్రి ఈ లోటును ఇలాగే వదిలివేయక రిజర్వు నిధినుంచి అంత మొత్తాన్ని తీసుకొని భర్తీచేయడానికి నిశ్చయించారు. ఈ కొద్దిమొత్తాన్ని తీసుకున్నందువల్ల రిజర్వు నిధిలో పెద్దకొరత ఏమీ ఏర్పడదు.

గత సంవత్సరంకంటే, పోలీసులు, జెయిలు శాఖలపై ఖర్చు వచ్చే సంవత్సరంలో తగ్గుతుందని ఆర్థికమంత్రి అంచనా వేశారు. హైదరాబాదులో పరిస్థితులు చాలావరకు శాంతించినవనే చెప్పవచ్చు. అయినా కమ్యూనిస్టులు తమ పరంగా వున్న ఆయుధాలను ప్రభుత్వపరం చేయనందున పోలీసుఖర్చును ఇంకా తగ్గించడానికి అవకాశం లేకుండా వుంది. తమ అధీనంలోవున్న ఆయుధాలనువప్పగించి పెట్టేస్తామని కమ్యూనిస్టు నాయకులు ప్రకటించినప్పటికీ ప్రభుత్వం పోలీసు ఖర్చును తగ్గించడానికి సాహసించలేకుండావుంది. అందుకు తెలంగాణాలో ఇదివరలో ప్రజ్వరిల్లిన [illegible] కారణం. శాంతికి భంగం కలగనివ్వనే నమ్మకం ప్రభుత్వానికి, ప్రజలకూకూడా కల్గితే పోలీసుఖర్చును 339 లక్షల రూపాయిలకంటే ఇంకా తగ్గించడానికి వీలు కావచ్చు. అయినప్పటికి రాష్ట్రాదాయంలో [illegible] గాను నూరింట 17 వంతులు విద్యాభివృద్ధికి ఖర్చు చేయడానికి ప్రభుత్వం నిశ్చయించింది. నీటిపారుదల సౌకర్యాలకు, వ్యవసాయాభివృద్ధికి, కమ్యూనిటీ ప్రాజెక్టుల నిర్వహణకు దాదాపు 682 లక్షల రూపాయిలను ప్రభుత్వం కేటాయించింది.

మైసూరు రాష్ట్రంలో వలె ఈ అభివృద్ధి పథకాల నిర్వహణ ప్రజలు ఇచ్చే ఋణాలపైనా, కేంద్రప్రభుత్వం ఇచ్చే గ్రాంట్లపైనా ఆధారపడి వుండదు. ఉస్మానియా కరెన్సీని తొలగించి యూనియన్ కరెన్సీని ప్రవేశపెట్టడంవల్ల ఈ మొదటి సంవత్సరం హైదరాబాదు ప్రభుత్వం కొంత లాభాన్ని పొందినా, అంతకుమించిన ఖర్చును భరించవలసి రావచ్చును ప్రభుత్వోద్యోగుల జీతాల విషయంలోనే. కేవలం ఎన్. జి. ఓ. లకు సంబంధించినంతవరకే అయినా - ప్రతిపాదనలను అంగీకరిస్తే ప్రభుత్వం దాదాపు కోటి రూపాయిల అదనపు ఖర్చును భరించవలసి వస్తుందని రాష్ట్రఆర్థికమంత్రి డాక్టర్ మేల్కోటే అన్నారు. ఇంత అదనపుఖర్చును భరించడం రాష్ట్రప్రభుత్వానికి సాధ్యం గాకపోవచ్చు. అయినా ఈ కరెన్సీమార్పువల్ల ఉద్యోగులకు ఎక్కువ కష్టనష్టాలు కలగకుండా చూడవలసిన బాధ్యత ప్రభుత్వంపై వుంది. ఈ బాధ్యతను సక్రమంగా నిర్వహించగలమనికూడా ఆర్థికమంత్రి హామీ ఇచ్చారు.

హైదరాబాదు భూసంస్కరణలఅమలుకు 9 లక్షల రూపాయిలను 1953-54 బడ్జెట్‌లో కేటాయించడంవల్ల ప్రభుత్వం శీఘ్రంగానే వ్యవసాయ సంస్కరణలను అమలు జరుపగలదని భావించవచ్చును. శాసనసభ ప్రస్తుత సమావేశంలోనే ఇందుకు సంబంధించిన శాసనాన్ని ఆమోదింపచేయగలమని ముఖ్యమంత్రి ప్రకటించారు. ఈ సంస్కరణలు అమలు జరిగి ముఖ్యమంత్రి ఆశించినట్లు భూమి లేనివారికి 10 లక్షల ఎకరాలను పంచ కలిగితే ఒకటి రెండు సంవత్సరాల్లో ప్రభుత్వాదాయం పెరగవచ్చును కూడా.

మైసూరురాష్ట్ర ఆర్థికస్థితి ఇంత తృప్తికరంగా వున్నట్లు కన్పించదు. 1953-54 లో ఏర్పడగల 157 లక్షల లోటును భర్తీ చేయడానికి పెట్రోలు, మోటారు పన్నులను, సెస్సులనూ విపరీతంగా పెంచడానికి ప్రభుత్వం నిశ్చయించింది. వీటన్నిటివల్లా దాదాపు 60 లక్షల రూపాయిలు లభిస్తవని అంచనా వేయబడింది. నీటిపారుదల స్కీములకుగాను నీటిపారుదల అభివృద్ధి నిధినుంచి యాభై లక్షల రూపాయిలను వాడుకోవడానికి కూడా ప్రభుత్వం తీర్మానించింది. ఇన్ని చేసినా 1953-54 సంవత్సరంలో పెట్టుబడి ఖాతాకు ప్రభుత్వం ఖర్చు చేయదలచిన 517 లక్షలూ అటు కేంద్రప్రభుత్వంనుంచి, ఇటు ప్రజలనుంచి లభించాలని, బడ్జెట్‌ను ప్రతిపాదిస్తూ మంత్రి శ్రీ ఎ. జి. రామచంద్రరావుగారు అన్నారు.

మైసూరు, తిరువాన్కూరు-కొచిన్, హైదరాబాద్ బడ్జెట్లనుబట్టి ఈ ప్రాంతం ఆర్థికస్థితి ఎలా వుందో గ్రహించవచ్చును. ఈ ప్రాంతంలో అభివృద్ధి పథకాలు శీఘ్రంగా అమలు జరిగి ప్రాజెక్టులు పూర్తి అయితేగాని ఆదాయం పెరిగే అవకాశం లేదు. ప్రథమ పంచవర్ష ప్రణాళిక ఏ ప్రాంతంలో విఫలమైనా ద్వితీయ ప్రణాళికకు అవరోధాలు ఏర్పడగలవు. కనుక కేంద్రప్రభుత్వం ఈ ప్రాంత అభివృద్ధి విషయంలో ఇంకా ఎక్కువశ్రద్ధ వహించి, తుంగభద్రా, దిగువ భవానీ ప్రాజెక్టుల నిర్మాణానికి సహాయపడినట్లే, ఇతర ప్రాజెక్టులను పూర్తిచేయడానికి తోడ్పడాలి.

## బర్మాలోని చైనా గెరిల్లాలు

### రంగూన్ సేనల దాడి

రంగూన్, మార్చి 12: షాన్ స్టేట్ ప్రాంతంలో బర్మాసేనలు నేడు ఛాంగ్ గెరిల్లాలను ఎదుర్కొని పారద్రోలాయి. వీరు తమ స్థావరానికి ఆగలేక పారిపోతూ వుండగా ఈ సైన్యాలు వారిని వెంటబడి తరిమి 10 మంది దాకా గెరిల్లాలను చంపివేసాయి. బర్మా సైనికులు ఈ సందర్భంలో ముగ్గురు నష్టమైనారు.

ఈ ముట్టడి సందర్భంలో బర్మా సేనలకు ఛాంగ్ గెరిల్లాలు వదిలిపోయిన ఆయుధ సామగ్రి చాలా దొరికింది.

## పెప్సూలో అధ్యక్ష పాలన

(1 వ పేజీ తరువాయి)

ప్రభుత్వమే కనుక ప్రధాన విషయాలలో నిర్ణయాలేమీ చేయదు. శాంతిభద్రతల సంరక్షణే దీని ప్రధాన కర్తవ్యం స్పీకరుతో మహారాష్ట్ర శాసనసభలోని సభ్యులు మొత్తం 60 మంది వీరిలో 26 గురు కాంగ్రెసువారు 22 మంది అకాలీలు ముగ్గురు కమ్యూనిస్టులు స్వతంత్రులు 7 గురు. మిగతా ఇద్దరిలో ఒకరు జనసంఘంవారు, మరొకరు కృషికార్ లోక్ పార్టీవారు. ఏపార్టీకి ఖచ్చితమైన మెజారిటీలేని ఈ స్థితిలో కమ్యూనిస్టులు 'పడికట్టు రాళ్ళ'గా ప్రయోజనం పొందుతున్నారు. ఇందులో 31 మంది సభ్యుల ఎన్నికపై 33 పిటీషన్లు వచ్చాయి. 19 పిటిషనులు విచారించి తీర్పు చెప్పిన ఫలితంగా ముఖ్యమంత్రితో సహా 8 మంది సభ్యత్వాలు కోల్పోయారు. ఇంకా 14 పిటీషన్లు అట్లాగే వున్నాయి. అంటే ఖాళీలు భర్తీకావాలంటే దాదాపు 25 స్థానాలకు ఉపఎన్నికలు జరగాలన్నమాట. అంటే కొద్ది ఎస్టులో అదీ ఎన్నికే అవుతుంది. ప్రస్తుత పరిస్థితులు న్యాయమైన ఎన్నికలకు అనుకూలంగా లేవు. 'ఏ' తరగతి రాష్ట్రాలలో వలె ఇక్కడ ప్రజాస్వామ్య సంప్రదాయం లేదు. 3 జిల్లాలోని 70 లేక 80 గ్రామాల పంచాయతీలు వేరే వేరే ప్రభుత్వాలుగా రూపొందాయి. మంత్రి వర్గంలో సామరస్యం లేదు. ఒకరు ఏటికి మరొకరు కోటికిగా వుంది వ్యవహారం. కొందరు ఇక తాము పన్నులు కట్టబోవటంలేదని నాతో చెప్పారు. ఈ పరిస్థితులు కొన్ని మాసాలక్రితమే ఏర్పడినా, ఏమైనా బాగుపడతాయేమోనని కాచి చూశాము. కాని ఏమీ ఫలితం కనిపించలేదు. శాంతిభద్రతలు లేక, దోపిడీలు, హత్యలూ నిత్యకృత్యాలయిపోతూంటే ఈ ప్రభుత్వం చూస్తూ పూరుకోజాలదు. అందుకే ఈ పని చేయకతప్పలేదు.

నేషనల్ డెమొక్రాటిక్ పార్టీ ప్రతిపాదించిన సవరణ 'పెప్సూలో అనవసరంగా, రాజ్యాంగ విరుద్ధంగా రాష్ట్రపతి పరిపాలనను విధించడానికి 'అసామోదం' తెలపాలనీ, కమ్యూనిస్టు పార్టీ సవరణ 'రాజప్రముఖ్ ని సస్పెండ్' చేయాలనీ కోరాయి. మొదటి సవరణపై మాట్లాడుతూ శ్యామప్రసాద్ ముఖర్జీ దేశంలో గల ఒక్కగానొక్క కాంగ్రెసేతర ప్రభుత్వాన్ని ఈ విధంగా తొలగించడం ప్రజాస్వామ్యానికి స్వస్తి చెప్పడమే ననీ, తీరికగా ఆలోచించుకొంటే ప్రభుత్వానికి ఇది అన్యాయంగా కనపడి తీరుతుందని అన్నారు. రెండవ సవరణపై హిరేన్ ముఖర్జీ మాట్లాడుతూ ఆ రాష్ట్రంలో కల్లోల పరిస్థితి పోగొట్టడమే ప్రభుత్వ ఉద్దేశమైతే రాజప్రముఖ్‌ను తొలగించి, వ్యవసాయ సంస్కరణలు జరిపించివుండేవనీ, ప్రజల పరిస్థితి బాగు చేసేందుకు మార్గం చూపక, ఈచర్య తీసుకోవడం ప్రజల హక్కులను భంగపర్చినట్లేననీ అన్నారు. ఇందులో కాంగ్రెసేతర ప్రభుత్వంపై రాజకీయ కక్ష సాధించుకోవడమే కనిపిస్తోందన్నారు.

కట్జూ చర్చకు సమాధానమిస్తూ కేంద్రంలో కాంగ్రెసుప్రభుత్వమున్నప్పటికీ ఏరాష్ట్రంలో ఏపార్టీ ప్రభుత్వమున్నా లెక్కలేదన్నారు. ఇతర రాష్ట్రాలలోవలెనే ఈ రాష్ట్రంలో కూడా తమ వ్యవహారాలను నిర్వహించుకొనే అవకాశం ప్రజలకివ్వాలనే ఈ ప్రభుత్వ ఉద్దేశమనీ, తప్పనిసరి అయినందుననే ఈ చర్య తీసుకోవలసి వచ్చిందనీ అన్నారు. సిక్కు స్నేహితులు దీనిని తమను అవమానించడంగా ఎంచరాదని విజ్ఞప్తిచేశారు. రాష్ట్రపతి పరిపాలన కలకాలము వుండబోవడం లేదన్నారు.

## ఆంధ్ర రాజధాని: రాజాజీ అభిప్రాయం

(1 వ పేజీ తరువాయి)

ఇది, గవర్నరు ఉపన్యాసం వ్యక్తిగత ప్రసంగం కాదు. ప్రభుత్వ విధానములను వివరించే ప్రసంగం. ప్రతిపక్ష నాయకుడు నన్ను కేంద్రప్రభుత్వంతో పోట్లాడమంటున్నారు. ఇప్పుడు జాతీయప్రభుత్వం వుండవలసిన సమయం. విభేదాలకు ఇది సమయంకాదు దురదృష్టవశాత్ మనము కోరగలము గాని కాలగతిని మార్చలేము. పార్టీ స్వార్థాలు లేకుండా పని చేయవలసిన సమయం వచ్చింది. ఇప్పుడు కాకపోయినా ఒకనాడు రాకతప్పదు. కమ్యూనిస్టుపార్టీ ఒక్క మాటమీద వుంటుంది. అందుకు అభినందిస్తున్నాను. కాంగ్రెసువారికి వారినిమాని నేర్చుకోవలసిందిగ సలహాకూడ ఇస్తున్నాను. కాంగ్రెసువారు ప్రతిపక్షంలో వున్నా కమ్యూనిస్టుపార్టీ అంత సమర్థంగ వుండలేరేమో. చిన్నపార్టీ కాబట్టి సంఘీభావం వుంటుంది. కమ్యూనిస్టుపార్టీ ఆంధ్రరాష్ట్రం విషయంలో సరియైన పంథా తీసుకుంది. కమ్యూనిస్టుపార్టీ ఐకమత్యంగల పార్టీ. అంతర్జాతీయపార్టీ. స్థానిక పార్టీగాదు. కాంగ్రెసు జాతీయతగల పార్టీ.

భాషారాష్ట్రాల విషయమై భారతదేశంలో ఇప్పుడున్న పరిస్థితులలో భాషారాష్ట్ర విభజన అత్యవసర సమస్య కాదని నా దృఢమైన అభిప్రాయం. భాషారాష్ట్రాలవల్ల సమస్యలు పరిష్కారం కావు. మరొక వామపక్ష నాయకుడు డా॥ కె. బి. మీనన్ సరిగా చెప్పారు.

చర్చలో అనేక విషయాలు గురించి ప్రస్తావించారు. త్వరలోనే బడ్జెటు చర్చ జరుగనున్నందున వివరాలకు పోదలచుకోలేదు. గౌతు లచ్చన్నగారు శిస్తు తగ్గింపు సవరణ బిల్లుగురించి తీవ్రంగా మాట్లాడారు. ప్రభుత్వం చేయుచున్నదని తప్పని చెప్పారు. వారి వాదం వ్యక్తిగతముగ వచ్చింది. వీలుంటే వాయిదా వేసే విషయం పరిశీలించవలసిందిగ రివెన్యూ మంత్రికి సూచిస్తున్నాను. ఇటువంటి బిల్లును సమగ్రపరిశీలన లేకుండా తొందరపడటం మంచిది కాదనే నా అభిప్రాయం.

పోలీసుసిబ్బందిగురించి ఎంతతక్కువగ చర్చిస్తే అంతమంచిది. మీరు (కమ్యూనిస్టు) ఎప్పుడూ ప్రతిపక్షంలో వుండరు. కమ్యూనిస్టుపార్టీ పాలనలో పోలీసులకు ఏమాత్రం స్వేచ్ఛ వుండదు. వారికి ఇప్పుడులభిస్తున్న సౌకర్యాలు, దాక్షిణ్యం లభించదు. కమ్యూనిస్టు పాలనలో పోలీసులు పార్టీకిలోబడి పనిచేయవలసి వస్తుంది. ఇప్పటిమట్టుకిటి పిటిషన్‌లకుఅవకాశం వుంది. మనం బీదవారం. పోలీసులుకూడ పేదరికం అనుభవించకతప్పదు. ఇతరవిషయాలలో ఏమిచేసినా కనీసం మిలిటరీ, పోలీసువిషయంలో కలుగజేసుకోవద్దని కమ్యూనిస్టు సోదరులను కోరుతున్నాను.

చర్చను రెండుభాగాలుగ విభజించవచ్చును. ఇంతకంటె బాగా చేయవచ్చును. చేసివుండవలసింద నేది ఒకటి మేము చేయుటకు శాయశక్తుల కృషి చేస్తాం. రెండవది మీరు చేయలేరనేది ఒకటి. నేను, నాప్రభుత్వం మార్పు ఉండాలంటాము గాని మార్పుక్రమంగా జరగాలని అంటాము. మార్పు ఒక్కరోజులో సాధ్యంకాదు.

నిర్మాణములు నిలిపివేయబడినవని, ఆంధ్రరాష్ట్రం యేర్పడ సున్నందున ఆపివేయబడినవని ఆరోపించారు. అది నిజంకాదు. భవిష్యత్ రాష్ట్రాలు నిర్ణయించవలసిన విషయాలనుమాత్రం వాయిదా వేయటం జరుగుతోంది అనీ, జాగ్రత్తగ పరిశీలించి చేయటం జరుగుతోంది.

సంపద పెరగనిదే క్షామం తొలగదు. సంపద అభివృద్ధికి ఇండియా ప్రభుత్వం ప్రణాళిక తయారు చేసింది. దానిని స్థూలంగ అంతా అంగీకరించారు. అమలు చేయటంలో కష్టాలు లేక పోలేదు.

నేను పదవి తీసుకున్నప్పటినుండి ఆకలిచావులు గురించి చెప్పటం జరుగుతోంది. నిజంగ ఆకలి చావులేవుంటే ఎన్నింటిని దాచగలం. అది సాధ్యమా. ప్రజలు అన్నంలేక చావలేదు. ప్రజలు ఎన్నికష్టాలు వచ్చినా సహించి నిలబడుతున్నారు. ఆకలిచావులు గురించి ప్రస్తావించవలసిన సమయం దాటిపోయింది. పూర్వం ఉద్యోగులను హెచ్చరించుటకు ఆకలిచావులు గురించి చెప్పేవారు. ఇప్పుడు ఆ శ్రమ అవసరంలేదు.

ఆంధ్రరాష్ట్రం గురించి నిన్న కవున్సిల్లో ప్రస్తావించవలసి వచ్చింది. ఈ సభలో ఆ విషయమై ఆవేశకావేశాలు లేకపోవుట చాల సంతోషం. తాత్కాలిక రాజధాని ఎందువలన మదరాసులో వుండకూడ దంటున్నానంటే కొట్లాటలు, తగవు విద్వేషాలు ప్రబలంగవున్న సమయంలో ఇక్కడ వుండటం మంచిది కాదని నా అభిప్రాయం. నేను ఆంధ్రుడనైనా వారికి సలహా ఇచ్చేవాడనే. వాంచూ రిపోర్టును నేనే తయారుచేశానని, [illegible] చేశానని ఒక పత్రిక ప్రకటించింది. ఇదంతా శుద్ధ అబద్ధం. పొట్టి శ్రీరాములు నిజంగా ఉపవాసం చేయలేదని నేను వ్రాశానని, తిరుపతిని కేంద్రపాలిత ప్రాంతంగ చేయమని మదరాసు ప్రభుత్వం శిఫార్సు చేసిందనీ ప్రకటించాయి. నన్ను అప్రతిష్టపాలు చేసే ఉద్దేశ్యంతో జరుగుతున్న దుష్ప్రచారం తప్ప మరేమీ కాదు.

తాత్కాలిక రాజధాని ఇక్కడ వుండటం క్షేమంకాదు. నిర్దాక్షిణ్యంగవున్నానని అనవచ్చును. ఈ నాటికి మదరాసుపై హక్కును వదులుకోలేదు గట్టిగ అడుగుతున్నారు. శ్రీ లంక సుందరంగారు ఎప్పుడోకాదు ఇటీవల 10 తే కూడ మదరాసు తాత్కాలిక రాజధాని కాకపోతే ఆంధ్రదేశంలో శ్రీరాములు మరణించిన తర్వాత జరిగిన సంఘటనలు జరుగుతా యని అన్నారు. ఎవ్వరూ ఇటువంటివానిని సమర్థించజాలరు. ప్రోత్సహించకూడదు. శ్రీ ప్రకాశంగారి కార్యాచరణసమితి ఇటీవల ఫిబ్రవరిలో సమావేశమై నగరంలో ఉద్యమం నడుపుటకు నిశ్చయించింది. ఇదంతా జరుగకపోవచ్చును. ప్రకాశంగారిని తీసివేయగల మా అప్రధానుడా కాదు నా మాట వింటే రేపు ఆయన ప్రధాని కావచ్చును. ప్రకాశం ఇక్కడివాడే. రాష్ట్రం వచ్చిన తర్వాత కూడ ఇక్కడ మంత్రిగ వుండవచ్చును. అల్లాడి వలె ఇక్కడివాడే పెద్ద న్యాయవాది. హైకోర్టు ఇక్కడే వుండాలనికూడ అనుకోవచ్చును. న్యాయంగ ఆలోచించే వారెవరు ఆంధ్రులకు మదరాసులో హక్కు లేదన లేరని ప్రకాశంగారు కాకినాడలో చెప్పారు. ఇదే చిక్కు. ఈపరిస్థితులలో ఇక్కడ వుండటం మంచిదికాదని నా అభిప్రాయం. 20 ఏళ్లు అయిన తరువాత పరిస్థితులు శాంతించిన తరువాత ఆంధ్రులను తిరిగి రమ్మని తమిళులు ఆహ్వానించవచ్చును. కాని అప్పుడు వారు రారు. కారణం అప్పటికి అధికారం సంపూర్ణంగ వారి చేతుల్లో వుండవచ్చును. రాష్ట్రం ఏర్పడిన తరువాత వ్యాపార వృత్తులకు ఏమీ ఆటంకం వుండదు. ఇష్టంవున్నా లేకపోయినా రాజధాని పెట్టిన తరువాత ఆ నగరం పెరుగుతుంది. ఆంధ్ర రాష్ట్రం వర్ధిల్లుతుంది. సౌభాగ్యవంతం అవుతుందనటంలో నాకెట్టి సందేహంలేదు. ఆంధ్రులు ఇక్కడ వుంటే వారిలో 25 పార్టీ బయలుదేరుతాయి. త్వరలో అంతా చక్కబడుతుంది. తాత్కాలికముగ కొంచెం కష్టంగవున్నా భవిష్యత్ బాగుపడగలదని నేను భావిస్తున్నాను.

### రివెన్యూమంత్రి సమాధానం

రివెన్యూమంత్రి గవర్నరు ప్రసంగంపై జరిగిన చర్చకు సమాధానం ఇస్తూ ఇల్లా అన్నారు: "క్షామం కొత్తదిగాదు. రామాయణకాలంలో కూడ క్షామం వున్నట్లు ఒక సభ్యుడు చెప్పారు. ఒకటి రెండేళ్ళయితే ఎల్లాగో అల్లా సర్దుకుంటాము. కాని వరసగా ఆరేళ్లనుండి క్షామం వుంది. రాయలసీమలోనే గాక సారవంతమైన జిల్లాలు మధ్యలో తూర్పు గోదావరిజిల్లాలో కొన్నిచోట్లకూడ క్షామం వుంది. ఈ రోజుల్లో ప్రచారంకూడ ఎక్కువగ వుంది. ప్రభుత్వం క్షామనివారణకు చేయవలసిన కృషి చేస్తున్నది. 4078 సహాయ పనులలో 2 లక్ష 54 వేలమంది పని చేస్తున్నారు. 2 వేల గంజికేంద్రాలు వుండేవి. కాని పరిస్థితులు బాగుపడిన చోట తీసివేసినందున 870 కేంద్రాలు వున్నాయి. 8 లక్షల 65 వేలమంది గంజి తీసుకుంటున్నారు. వ్యవసాయ ఋణాలక్రింద సుమారు 2 కోట్లు, జీవనభృతి ఋణాలక్రింద 27 లక్షలు ఇవ్వబడింది. గంజికేంద్రాల క్రింద 88 లక్షలు ఖర్చు అయింది. శిస్తు రిమిషను లు రు 75 వరకు వుంటాయి. క్షామమే గాక తుపానువలన నష్టపడిన వారికి సహాయం చేయవలసి వచ్చింది. క్షామనివారణక్రింద అనంతపురం జిల్లాలో కోటి 7 లక్షలు, కడపలో 1 కోటి 29 లక్షలు, చిత్తూరుజిల్లాలో 1 కోటి 38 లక్షలు ఖర్చుఅయింది. ప్రాంతీయ విభేదాలు లేకుండా సహాయ కార్యక్రమం నిర్వహిస్తున్నాం. నేను తమిళుడవుటవలన విమర్శకు అవకాశం లేకుండా శ్రద్ధగ పనిచేస్తున్నాను. క్షామమునే నివారించుటకు కమిటీ వేయాలని సూచించారు. ఇండియా ప్రభుత్వం ఒక కమిటీ వేసింది, దాని శిఫార్సుల కొరకు ఎదురు చూస్తున్నాం. బావు త్రవ్వకానికి రు 150 ల విరాళమిచ్చే స్కీమును ప్రభుత్వం ఇటీవలనే పునరుద్ధరించింది. ఇందువలన మంచినీటి ఇబ్బంది కొంతవరకు తగ్గవచ్చని ఆశిస్తున్నాను.

తోడాలజాతి వసించకుండా భూములను ఇవ్వాలని అన్నారు. ఇస్తున్నాం. కాని వారు సోమరు లయినందున వ్యవసాయం చేయరు. ఆ భూములను ఇతరులు తీసుకొని లాభం పొందుతున్నారు. ఫిబ్రవరి 15 వరకు 7 కోట్లు క్షామ నివారణక్రింద ఖర్చు పెట్టాం, ఇప్పటికి రు 10 కోట్లు అయి వుంటుంది. ఆకలిచావులు అని చెప్పబడేవి అన్నీ అబద్ధాలు. ఈ చావులు కాకతాళీయంగ జరుగుతున్నాయి. కనుక ఈ విషయమై విపరీత ప్రచారం చేయవద్దని సభ్యులకు విజ్ఞప్తి చేస్తున్నాను.

"మనకు స్వతంత్రంవచ్చింది. చేయవలసింది చాలవుంది. వివాదములతో కాలంగడిపిన ప్రయోజనంలేదు. కష్టాలను ఎదుర్కొనే విషయంలో ఇంగ్లండును చూసి నేర్చుకోవలసింది చాల వుంది. ప్రతివారు తమ విద్యుక్తధర్మమును నెరవేర్చాలని విజ్ఞప్తి చేస్తున్నాను. దేశసౌభాగ్యంకోసం, కల్యాణంకోసం మనం అంతా పాటుపడాలని కోరుతున్నాను.

## కౌన్సిల్‌లో చర్చకు సమాధానం

మద్రాసు, మార్చి 13: మద్రాసులో తాత్కాలికంగానూ ఆంధ్ర రాజధాని ఉండటం ఉభయులకు శ్రేయస్కరంగాదు. అల్లా ఉన్నట్లయితే రోజురోజుకు ద్వేషం పెరిగిపోతుంది. ద్వేషం పెరిగితే ఏమి జరుగుతుందో చెప్పలేము. ఆంధ్రరాజధాని వేరేచోటయితేనే త్వరలోనే మన స్నేహము పునఃప్రవర్ధమానం కావచ్చు. ఇక్కడ ఉంటేమటుకు, ఆ రోజు నిరవధికంగా వాయిదాపడగలదని హెచ్చరిస్తున్నాము," అని మద్రాసు ముఖ్యమంత్రి చక్రవర్తి రాజగోపాలాచారిగారు నిన్న సాయంత్రం మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలులో గవర్నరు ప్రసంగంపై జరిగిన చర్చకు సమాధానంగా చెప్పారు. డా॥ పి. వి. చెరియన్ గారు అధ్యక్షత వహించారు.

రాజగోపాలాచారిగారు తమ సమాధానంలో ఇల్లా చెప్పారు:- "డా॥ లక్ష్మణస్వామిగారి ఉపన్యాసం వింటున్నప్పుడు అంతా స్నేహవాతావరణం వెల్లివిరిసింది. సౌహార్దంతో మనం పని చేస్తే ఎన్ని కష్టాలైనా ఎదుర్కొనగలము. వెంకట్రావుగారి ప్రసంగం ఆ వాతావరణాన్ని భగ్నం చేసింది. వెంకట్రావుగారు చిత్తశుద్ధి గలవారు. మా ప్రభుత్వాన్ని బలపర చేవారు. అయితే ఆయన నా ఎడమటుకు తీవ్ర అపచారాన్ని, అన్యాయాన్ని చేసినవారైనారు. పొట్టి శ్రీరాములుగారి దగ్గిరకు వెళ్లి నన్ను చెప్పమని కోరినప్పుడు, నే నిచ్చిన సమాధానం వారికి జ్ఞాపకం ఉండి ఉండాలి. నేను వెళ్లి చెప్పలేదు గాబట్టి శ్రీరాములుగారు చచ్చిపోయారని వెంకట్రావుగారు శోకించారు. వారి మరణానికి నేను కారకుణ్ణిగాను. ఇతరులు కారకులు. వారిని చేతులారా చంపిన వారిని నేను వేలు పెట్టి చూపగలను. అందువల్ల ప్రయోజనం లేదు. ఈవిధంగా ఆత్మార్పణం చేయబూనడం ప్రజాస్వామ్య పురోగమనానికి మార్గం గాదు. అది ప్రజాస్వామ్య విరుద్ధము. నియంతృత్వము అయిన పద్ధతి. ఆ యీ ఉపవాస ఉద్దేశ్య గుణదోషాలమాట అల్లా ఉంచుదాము. ఒకమనిషి తన అభిప్రాయాన్ని అందరిపై రుద్దటానికి ఈ ప్రాయోపవేశమార్గం సవ్యంగాదు. గాంధీగారికి గూడా అదే చెప్పాను. ఉపవాసం చేసేవానికి శక్తి తగ్గి ఆలోచనా శక్తి ఉడిగిపోతుంది. భారతప్రధాన మంత్రి చర్య తీసుకుంటున్నానని చెప్పినా ఆయన విరమించాడుగాదు.

### శ్రీరాములుగారి మరణం

"నేను చెబితే ఆయన వినడు. ఆయన చెబితే వినేవారు ఆయనకు చెప్పారుగాదు. పైగా ప్రజాస్వామ్యానికి విరుద్ధంగా ఉపకరణంగా ఆయన్ను ఉపయోగించుకున్నారు. గతి జలసేతు బంధనంవల్ల లాభం లేదు. ఏమైనా ఆంధ్రరాష్ట్రం-దానిలోవచ్చే చిక్కులతోను, గందరగోళాలతోను రానున్నది. వెంకట్రావుగారు నన్ను హంతకులని వారి ప్రసంగంలో సూచించినట్లయింది. నేను చాలాతప్పులు చేసి ఉండవచ్చు. వాటిని ఒప్పుకున్నాను. ఈ విషయంలో మటుకు నేను నిర్దోషిని. ఆయన చుట్టూ చేరినవారు దోషులు.

"శ్రీరాములుగారి మరణానంతరం అందరికి సిగ్గుచేటైన పనులు ఆంధ్ర దేశంలో జరిగినవి. వెంకట్రావుగారు వాటినిగూర్చి ఒక్కముక్క చెప్పారుగాదు. [శ్రీ వెంకట్రావు- నేను వాటిని సహించలేదు] తెలివైనవారే- సామాన్య ప్రజానీకాన్ని ఇందుకు ఉపయోగించారు. ఇంత పరిపాలనానుభవం ఉన్న నాకు, భారత ప్రధానమంత్రికి, ఇవి గర్వకారణంగాదు. అందువల్ల వీటినిగూర్చి ఎంత తక్కువ చెబితే అంతమంచిది."

### ఆంధ్ర రాజధాని

"పత్రికలకు వాంచూ నివేదిక ఎల్లా వచ్చినదో నాకు తెలియదు. నాకు పూర్వమే నాటిసారం వారికి తెలిసింది. మద్రాసు ఆంధ్రుల రాజధానిగా ఉండటం ఆంధ్రులకు శ్రేయస్కరం గాదు. మద్రాసుపై ఆంధ్రులకు హక్కు లేదంటున్నా, ఇంకా హక్కు ఉన్నదని లంక సుందరంవంటి పెద్దమనుష్యులు అంటున్నారు. ఈలాంటి అతిథులు, అద్దెకు ఉండేవారు మాకువద్దు. అయితే ఈమాట ఇతరులు చెప్పరాదా? ముఖ్యమంత్రి ఏం చెప్పవలెనంటారు. నేను భారాన్ని ఇంకొకరిపై తోసేరకం గాను. బహిరంగంగా ఉన్న సంగతి నేనే చెప్పదలచాను. కమ్యూనిస్టుల ఉద్దేశ్యాలు, తాత్పర్యం భిన్నమైనా ఈ విషయమై వారు సౌష్ఠవమైననిర్ణయానికివచ్చారు. తెల్లవారేసరికి ఒక్కరోజులో బయటికి ఎల్లా పొమ్మంటారు అంటున్నారు. ఎవరు పొమ్మన్నారు? మీరేపోతామన్నారు గనుక అనుభవించవలసిందే. మార్చి 15 లోపల రాష్ట్రం రాకపోతే ప్రాణం అర్పిస్తామని కొందరు అంటున్నారు. ఈతొందర గడబిడ అంతా కోరితెచ్చుకున్నప్పుడు అందులో వచ్చే కష్టసుఖాలన్నీ పొందవలసిందే. ఇక్కడ ఆంధ్రరాజధాని ఉంటే రోజురోజుకు ద్వేషం పెరుగగలదు. సంఘర్షణలు రావచ్చు. దుస్సాధ్యమైన పరిస్థితులు ఏర్పడవచ్చు. ఇదంతా సవ్యంగా పడవాలి. కొంతకాలం అయ్యాక విడిపోయి ఉన్నవారు మళ్ళీ స్నేహంగా కలుసుకొనే అవకాశంవుంది. లేకపోతే ఆరోజు నిరవధికంగా దూరం గాగలదు.

### పరిపాలనకు ఏదిఅనుగుణ్యమో అది చూడాలి

"డా॥ లక్ష్మణస్వామివంటి అనుభవజ్ఞులు భాషారాష్ట్రాలను గూర్చి అది అనాగరిక భావమని నేను చెప్పిన దానిలో ఏకీభవించినందుకు సంతోషిస్తున్నాను. ఒకశాఖకు చెందినవారంతా చేరినట్లు ఒకమతాను చెందినవారు ఒకచోట చేరినటుల ఒకభాషను చెందినవారు ఒకచోట చేరటం నాగరికంగాదు. భారతదేశంవంటి మహోన్నత దేశానికి ఈ పద్ధతి తగదు. సామర్థ్యము, సత్పరిపాలన, పనిజరగడం మనకు కావాలి. రైల్వేలు, రహదార్లు, విమానాలు, వచ్చిన రోజులివి. పరిపాలనకు ఏది అనుగుణ్యమో అదిచూడాలిగాని ఇది పద్ధతిగాదు. భారత ప్రభుత్వంకూడా ఈ విధంగా ఆలోచిస్తున్నందుకు సంతోషిస్తున్నాను. ఈ దృష్ట్యా వారు పరిస్థితులను పునః ఆలోచిస్తున్నారు. ఈ నినాదాలను అందం తగ్గించే రోజులు వచ్చినవి. ముందుకుగాని, గాని, ప్రస్తుతానికిగాని ఈ భాషా రాష్ట్రీయ శ్రేయస్కరం గాదు."

## మీనన్‌కు 7 ఏండ్లు, దేవకికి మూడేండ్లు శిక్ష

### ఆళవందార్ హత్యకేసులో తీర్పు

మదరాసు, మార్చి 13: ఆళవందార్ హత్యకేసులో మదరాసు హైకోర్టు సెషన్సులో యీ దినం న్యా॥ ఏ. యస్. పి. అయ్యరుగారు 1 వ ముద్దాయి మీనన్‌కు ఇండియన్ పీనలుకోడు సెక్షను 304 క్రింద 7 యేండ్ల కఠిన శిక్షయును, రెండవ ముద్దాయి దేవకికి అదే సెక్షనుక్రింద 3 యేండ్ల శిక్షయును విధిస్తూ తీర్పు చెప్పారు.

## శిస్తు తగ్గింపుబిల్లును ప్రభుత్వం ఉపసంహరించుకునే అవకాశం

### అసెంబ్లీలో గవర్నరు ప్రసంగంపై చర్చకు సమాధానమిస్తూ ముఖ్యమంత్రి సూచన

చెన్నపట్నం, మార్చి 13: ముఖ్యమంత్రి శ్రీ సి. రాజగోపాలాచారిగారు ఇవాళ అసెంబ్లీలో గవర్నరు ప్రసంగంపై సభ్యులు చేసిన విమర్శలకు సమాధానమిస్తూ శిస్తు తగ్గింపు చట్టసవరణ బిల్లుకు కృషికార్ లోక్ పార్టీ నాయకుడు శ్రీ లచ్చన్నగారు తెలిపిన ఆక్షేపణలు సబబుగానేవున్నట్లు తమకు తోచిందనీ, ఈ సవరణబిల్లును ఉపసంహరించే విషయం విచారించవలసిందిగా తాము రివెన్యూమంత్రికి సూచిస్తామనీ చెప్పారు. గవర్నరు ప్రసంగంపై అసెంబ్లీ చర్చ నాలుగు రోజులు సాగింది. ఇవాళ అసెంబ్లీలోని ముఖ్య పార్టీల నాయకులు మాట్లాడారు. తరువాత రివెన్యూ మంత్రి, ముఖ్యమంత్రి సమాధానమిచ్చారు. (వీరి సమాధానాలు విడిగా ప్రకటించబడినవి.)

శ్రీ గౌతు లచ్చన్న (కృషికార్) గారిలా ప్రసంగించారు:

రివిన్యూ మంత్రి శిస్తు తగ్గింపు బిల్లు గురించి చెప్తారనుకున్నాను కాని చెప్పలేదు. సెలెక్టు కమిటీ నిరాకరించిన బిల్లును శాసను మార్చిమరలప్రతిపాదించదలచటం ప్రజాభిప్రాయమును ప్రభుత్వం గుర్తించలేదనీ చెప్పటకు విచారిస్తున్నాను. తప్పులను దిద్దుకొనుటకు మాత్రమే బిల్లును తీసుకొని వస్తున్నామంటున్నారు. చేసిన తప్పు ఏమిటి? ఎస్టేటు కాని వానిని ఎస్టేటుగ పరిగణించబడిందట. దానిని దిద్దుకోవాలట. ఎస్టేటు నిర్వచన చట్టాన్ని తీసుకొని రావటంవల్ల చాల ప్రమాదాలు జరుగగలవు. ఆంధ్రరాష్ట్రంలో 6 వేల చిల్లర గ్రామాలలో అరాచకం ఏర్పడుతుంది. ప్రకటించిన వానిని తిరిగి ఎస్టేట్లు కావని [illegible] వేల గ్రామాలను అల్లా చేయవలసి వుంది. శిస్తు తగ్గింపు అమలును ఏ ప్రభుత్వశాసనము రద్దు చేయలేదు. ఈ బిల్లు అమలు కాదు. కానేరదు. ప్రజానీకం ఈ బిల్లును వ్యతిరేకించ తీరుతారు. కనుక బిల్లును విరమించుకోవలసిందని హెచ్చరిస్తున్నాను.

వాస్తవమైన పరిస్థితులను గుర్తించి ధార్టిబిల్లును విరమించుకొన్నట్లు శిస్తు తగ్గింపుబిల్లును విరమించుకోవాలని కోరుతున్నాను. మొండిగ తీసుకొని వస్తే అరాచకం తప్పదు. ధాన్యపుశిస్తు గ్రామప్రజల కష్టాలను పరిశీలించక పోవుట విచారకరం. కొత్తపనులు చేయకపోతే మాని పాతమరమ్మతులు చేయకుండా తన్నీలు లెక్కలనుబట్టి బకాయిలతోసహా శిస్తులను వసూలుచేయుట న్యాయంగాదు. మరమ్మతులు చేయని ప్రభుత్వానికి పన్ను చెల్లించవలసిన బాధ్యత ప్రజలకు లేదు. అడగటానికి ప్రభుత్వానికి నైతిక హక్కు లేదు. [illegible] కేసునపుడే ఒక రైతుఎడ్లను జప్తు చేసి తీసుకొనివెళ్లటమేగాక పైపెచ్చు అతనిపై కేసు పెట్టారు. నిన్న మంత్రిగారిని కలుసుకొన్నప్పుడు రాష్ట్రం వస్తున్నదిగదా ఆందోళన ఎందుకన్నారు? జబర్దస్తీగ శిస్తులుమాత్రం వసూలుచేస్తున్నారు. వారికి వసూలు చేసే హక్కు ఏమీ లేదు. ఎస్టేటుగ్రామాల్లో పాత బకాయిల వసూలును వాయిదా వేయాలి. బీదప్రజలనుండి ఒక్క ఏడాదిలోనే బకాయిలను వసూలుచేయటం అన్యాయం. అక్రమం. ఇది ఎవరిని బలపర్చటానికో తెలియకుండావుంది. ఆత్మవినాశకరమైన ఈ విధానమును ఎంతత్వరగ మార్చుకుంటే అంతమంచిదని చెప్తున్నాను. పనులను ఆపుచేసినట్లే శిస్తు వసూళ్ళనుకూడ ఆపుచేయాలి.

"మాగురించి, మా భవిష్యత్ గురించి చెట్టినాడ్ రాజాగారు, చాలకాలం వినియోగించినందుకు కృతజ్ఞత తెలుపుతున్నాను. సోదరులవలె విడిపోవాలంటే రక్తప్రవాహం జరుగుతుందని అనటం సరసముగలేదు. ఆంధ్ర అరవ రాష్ట్రాలు రెండూ కలిసివుంటేగాని భారతదేశం వృద్ధికాదు. కాని లోపల ఒకటి పెట్టుకొని పైకిఒకటి చెప్పటం మంచిదికాదు. ఇకముందైనా ఆంధ్ర రాష్ట్రంగురించి అధిక ప్రసంగాలు చేయకుండా కార్యక్రమమును సాఫీగ నడిపించగలరని ఆశిస్తున్నాను."

పాయింట్ ఆఫ్ ఆర్డరు క్రింద శ్రీ గారపాటి సత్యనారాయణగారు "సవరణల నోటీసులిచ్చిన వారికి మాట్లాడేందుకు అవకాశం ఇస్తామన్నారు. కాని ఇవ్వలేదు. ఒక్క ముస్లింలీగు వారిలోనే 6 గురికి మాట్లాడేందుకు అవకాశం ఇచ్చారని" అనగా, అందరికి అవకాశం ఇచ్చేందుకు వీలుపడదని స్పీకరు పాయింట్ ఆఫ్ ఆర్డరు త్రోసివేశారు.

జనాబ్ ఉప్పీసాహెబ్ మాట్లాడిన తరువాత శ్రీ కె. బి. మీనన్ మాట్లాడుతూ సకాలంలో కేంద్ర ప్రభుత్వం ఆంధ్రరాష్ట్రమును ఏర్పాటు చేయలేదన్నారు. విన్నపము, ఉపవాసములు విఫలమై దౌర్జన్య ఫలితముగ ఏర్పడుతున్నది. విడిపోవటం నాకు ఇష్టం లేదు. అంటే భాషారాష్ట్రాలంటే నేను వ్యతిరేకినని కోవద్దు. అయితే ఇది సమయం కాదు. జాతీయ భావము ఎక్కువ కావలసిన సమయం ఇది. ఈ సమయంలో యావత్ శక్తిని వినియోగించాలి, విభజనవల్ల మదరాసు రాష్ట్రం విలువ తగ్గిపోతుందని అన్నారు.

### ప్రతిపక్షనాయకుని ప్రసంగం

ప్రతిపక్ష నాయకుడు శ్రీ పి. రామమూర్తి మాట్లాడుతూ ఇల్లా చెప్పారు: "గవర్నరు తమ ప్రసంగంలో రాష్ట్రంలోని స్థితిగతులను సరిగా చిత్రించలేదు. పంచవర్ష ప్రణాళిక గురించి ఎక్కువ ఏమీ చెప్పలేదు. క్షామం రాయలసీమలోనే గాక దక్షిణాది జిల్లాలకు సర్కారు జిల్లాలకు కూడ వ్యాపించిందని సభ్యులు చెప్పారు. మంత్రిగారు కూడ అంగీకరించారు. ప్రభుత్వంవారు తగు చర్య తీసుకొనే నిమిత్తం సభ్యులు క్షామం గురించి అంతగా ఇక్కడ చెపుతున్నారు.

ప్రభుత్వము, పరిపాలించుతున్న పార్టీ వాస్తవ విషయాలను మరుగుపరుస్తున్నది. రాజ్యాంగం రాష్ట్రప్రభుత్వాలకు అడ్డంవస్తుంటే రాజ్యాంగమును మార్చుటకై కృషి చేయకతప్పదు. క్షామనివారణకు రు 10 కోట్లు చాలుతుందా అనే విషయాన్ని పరిశీలించాలి. ఈ 9 నెలల్లో వేలకొలది కార్మికుల్లో నిరుద్యోగం పెరిగింది. ఉత్పత్తి తగ్గింది. ప్రభుత్వం ఇందుకు ఏమిచేసింది? వచ్చేసంవత్సరం పరిస్థితులు బాగుపడతాయని హామీ ఎక్కడవుంది. థర్మల్ స్టేషన్ నిర్మించుటకు ఎందుకు పూనుకోలేదు. థర్మల్ స్టేషన్ నిర్మాణమునకు ప్రభుత్వం ఎందుకు కృషిచేయలేదని అడుగుతాను.

ధరలను పెంచి సామాన్యజనము కొనలేకుండా చేసి ఆహారసమస్యను ప్రభుత్వం పరిష్కరించాలని చూస్తున్నది. ఈ పద్ధతి పంచవర్ష ప్రణాళిక అమలుకు దోహదంచవ్వదు. కార్మికులలో నిరుద్యోగం తొలగించుటకు ప్రభుత్వం ఏమీ చేయలేదు. చేనేతవారికి నూలు సప్లయి చేయలేకపోయింది. [illegible] రెంటి ఉత్పత్తిని పెంచినా ప్రజలకు కావలసిన వస్తువులు సప్లయిలేదు.

# 'మొహంజదారో' అంటే ప్రఖ్యాత చరిత్రకారుడట!

## హైదరాబాదు పబ్లిక్ సర్వీస్ కమిషన్ పరీక్షలో అభ్యర్థుల సమాధానాలలోని 'మచ్చుతునకలు'

సికిందరాబాదు, మార్చి 12 : హైదరాబాద్ పబ్లిక్ సర్వీస్ కమీషను పరీక్షలకు కూర్చున్న కొందరు అభ్యర్థుల విచిత్ర తెలివితేటలను ప్రదర్శించే ఉదాహరణలు కొన్ని కమీషన్ వార్షిక నివేదికలో పొందుపరచాయి. అట్టి అభ్యర్థుల్లో ఒక ప్రబుద్ధుడు మొహంజోదారోను గురించి అడిగితే 'అతడొక సుప్రసిద్ధ చారిత్రకుడు' అని చెప్పిన సమాధానమిచ్చాడట.

లోకజ్ఞాన విషయంలోనే కాదు తమ అభిమత విషయాలలో కూడా అభ్యర్థులు ప్రదర్శించిన అజ్ఞానానికీ, చూపించిన అతెలివితేటలకేను ప్రమాణానికి చాలా నొచ్చుకుంటూ నేటి చదువుల బండారాన్ని బయట పెట్టుటకుగాను అభ్యర్థులిచ్చిన మరి కొన్ని సమాధానాలను కూడ కమీషన్ వారు తమ నివేదికలో పేర్కొన్నారు. అవి యిలా ఉన్నాయి :

చిరపుంజి కొరియాలో 38వ అక్షాంశరేఖ యందున్నది.

హ్యాటీ అనేది పసిఫిక్ మహాసముద్రంలోని ఒక ద్వీపం (ఒక ముల్కీ అభ్యర్థి మాటలో ఇది హట్టీ అనేది రాయచూరు జిల్లాలోని ఒక బంగారు గని స్థలం)

ఎలిఫెంటా—ఒక భయంకరమైన రోగం. జయాగరా జలపాతం ఇండియాలో ఉంది.

నోబెల్ ప్రైజ్—నోబెల్ అనే ఆయన ఒక ఇంగ్లీషు కవి.

'వార్ అండ్ పీస్' అనే గ్రంథం రచించింది పండిట్ జవహర్లాల్ నెహ్రూ.

మొత్తంమీద పరీక్షలకు హాజరైన అభ్యర్థుల విద్యాప్రమాణం చాలా తక్కువైనట్లు రుజువయిందనీ, నేటి విశ్వవిద్యాలయాలు ప్రసాదిస్తున్న చదువుల నాణ్యం చాలా దిగజారిపోయిందనడానికీ, దానిని చక్కబెట్టవలసి యున్నదనడానికీ ఈ పరిస్థితి ప్రబల ప్రమాణంగా భావిస్తున్నదనీ కమీషను వారు తమ నివేదికలో తెలియజేశారు. ఆరు నెలలపాటో, సంవత్సరంపాటో పట్టాలు పుచ్చుకొని చదువులు చాలించుకొని వచ్చిన తమకు ఇటువంటి ప్రశ్నలన్నీ అడిగితే ఆసంగతులన్నీ ఎక్కడ జ్ఞాపకముంటాయని కొందరుకొందరు అభ్యర్థులు అమాయకంగా అడిగినట్లు కూడ కమీషన్ వారు పేర్కొన్నారు.

### పబ్లిక్ సర్వీస్ కమిషన్ వార్షిక నివేదిక

హైదరాబాదు, మార్చి 12 : పబ్లిక్ సర్వీస్ కమిషనును గురించిన (1951-52) వార్షిక నివేదికను ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణరావుగారు నేటిదినం హైదరాబాదు శాసన సభయెదుట పెట్టారు. దానితో పాటు తమ మెమోరాండం కూడ ఒకటి సమర్పించారు. కొన్నికొన్ని కేసులలో కమిషనువారి సిఫార్సులను ఎందుకుగాను పాటించక పోయిందీ ఆ మెమోరాండంలో వారు వివరించారు.

హైదరాబాద్ వార్తలు :

## హైదరాబాద్‌లో 'కరెన్సీ' మార్పు

### కొత్తగూడెం బొగ్గుగనుల కార్మికుల హెచ్చరికి

కొత్తగూడెం, మార్చి 12: "జీతాలైతే నేమి,కూలీఅయితే నేమి 'హాలీ' రూపంలో ఇప్పుడెంత ఇస్తున్నారో ఇండియా కరెన్సీ అమలుకు వచ్చిన తర్వాత కూడ అంతే మొత్తం ఆ కరెన్సీలో ఇవ్వాలి. మారకం రేటుప్రకారం ఇస్తామంటే పరిపోదు. యజమానులు ఈ కోరికను సమ్మతించకపోతే ఈ నెల ఆఖరునాటినుంచి సమ్మె చేయటంకన్నా [illegible] వేరే గత్యంతరం లేదు." అంటూ ఇక్కడి బొగ్గుగనుల కార్మికులందరూ హైదరాబాదు శాసనసభలో ఆర్థికమంత్రి ఇటీవల చేసిన ప్రకటనను విమర్శిస్తూ ఉమ్మడిగా హెచ్చరిక చేశారు.

ఇందుకు సంబంధించిన అధికారులు కార్మికుల ఈ కోరికను సమ్మతించకపోతే సంస్థానమంతటా సాధారణ సమ్మె జరిగినా జరగవచ్చునని కూడ ప్రముఖ కార్మిక నాయకులు సూచించారు. కొత్తగూడెం కాలరీలలో 14000 …

కృష్ణమూర్తి శాస్త్రిగారు సభను ప్రారంభిస్తారు. శ్రీ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు, పుట్టపర్తి నారాయణచార్యులు, దివాకర్ల వెంకటావధాని గార్లు ఉపన్యాసాలు, నారాయణరెడ్డి రాఘవరెడ్డిగార్ల కావ్యగానము ఉంటాయి.

## ప్రజాసోషలిస్టు కార్యకర్తలపై దౌర్జన్యం

### వరంగల్లు సమీపంలో సంఘటన

వరంగల్, మార్చి 11: నిన్న టిదినం పల్లెర్ల గ్రామానికి స్వంతపనుల నిమిత్తమై వెళ్తున్న తమ కార్యకర్తలను కొందరు దుండగులు గొడ్డళ్లతోను, లాఠీలతోను బలంగా కొట్టారనీ, ఫలితంగా బాబూరావు, డి. మల్లయ్య, డి. రాయుడు, డి. యెల్లయ్య అనువారు తీవ్రంగా గాయపడి ఆస్పత్రిలో చేర్చబడినారనీ, స్థానిక ప్రజాసోషలిస్టు పార్టీ కార్యాలయంవారు ఒక బులెటిన్ ద్వారా తెల్పుతున్నారు. ప్రజలలో జొచ్చుకొనిపోతున్న తమ కార్యకర్తలను ఏ విధంగానైనా అణచివేయాలని వీరు చూస్తున్నారనీ తెల్పుతున్నది. పోలీసు లింతవరకు ఎవ్వరిని అరెస్టు చేయలేదు.

### ఆంధ్ర సారస్వత పరిషత్తు 'విశారద పరీక్షలు'

హైదరాబాదు, మార్చి 10: హైదరాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్తు వారు ఇట్లు ప్రకటిస్తున్నారు: 'పరిషత్తు 'విశారద' పరీక్షలు మేనెల రెండవ వారమునుండి ప్రారంభమై పూర్వభాగ ఉత్తరభాగ పరీక్షలు క్రమముగా ఎదు రోజులవరకు జరుగును. ప్రతిరోజు ఒకే ప్రశ్నపత్రము ఉండును. అభ్యర్థులు శుల్కమును, అభ్యర్థిపత్రమును పూరించి మార్చి 31-వ తేదీలోగా పరిషత్తు ప్రధాన కార్యాలయమునకు చేరునట్లు పంపవలయును. అభ్యర్థులు వీటిని తాము పరీక్షనొసగదలచిన కేంద్రము ద్వారా పంపిన విశేషము. అభ్యర్థిపత్రములో కేంద్రమును గూడ వివరించవలెను.'

హైదరాబాదు ప్రభుత్వంవారిచే విశారద పరీక్ష ఆమోదింపబడింది. ప్రభుత్వ ప్రకటన త్వరలో ప్రకటించబడును.

### నిరుద్యోగ సంఘంలో వి. బి. రాజుకు సభ్యత్వం

హైదరాబాదు మార్చి 11 : ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణరావుగారు తెచ్చిన తీర్మానంపై హైదరాబాదు శాసన సభవారు నేడు మాజీ కార్మిక మంత్రి వల్లూరి బసవరాజుగారిని నిరుద్యోగ సంఘంలో ఒక సభ్యునిగా ఎన్నుకొన్నారు. దీనితో ఆ సంఘ సంఖ్యాబలం 12 అవుతుంది.

### మైసూరులో మిగిలిన 4 జిల్లాలకూ మద్యనిషేధ విస్తరణ

బెంగుళూరు, మార్చి 11 : ప్రస్తుతానికి మద్యనిషేధాన్ని సంస్థానంలో తక్కిన 4 జిల్లాలకూ కూడ విస్తరింపచేయడం సాధ్యపడదని మద్యనిషేధ శాఖ మంత్రి టి. చెన్నయ్యగారు మైసూరు లెజిస్లేటివ్ కౌన్సిలులో నేడు చెప్పారు.

## లక్ష రూపాయల ఖర్చుతో వరంగల్లుకు పార్కు

### నిర్మించడానికి మునిసిపాలిటీ నిర్ణయం

వరంగల్, మార్చి 11: వరంగల్ మున్సిపల్ కమిటీ మొన్న టి. వాయ గ్రీవాచారిగారి అధ్యక్షతను సమావేశమైనప్పుడు వరంగల్ ప్రాంతంలో ఒక పార్కును నిర్మించడానికి నిర్ణయించారు. మున్సిపాలిటీలో ప్రస్తుతం నిలువవున్న రు 4,47,940నుండి కనీసం ఒక లక్ష రూపాయలైనా ఈ పార్కు నిర్మాణానికై కేటాయించటం జరుగుతుందని తెలుస్తున్నది. నగరంలో పార్కు లేనందున నగరం యొక్క శోభ తగ్గిపోయిందనీ, ఎలాగైనా ఒక పార్కు నిర్మాణం అవసరమనే విషయం …

టర్కీ పార్లమెంటు ప్రతినిధులకు ప్రజాసభ స్పీకరు శ్రీ మావలంకర్ ఢిల్లీలో ఈ 10వ తేదీన విందు చేసిన సందర్భంలో ఆయనకువారు ఇస్తాంబుల్ నుంచి తెచ్చిన ఒక పూలల్లిక మేజాగుడ్డను బహూకరించారు.

# "మద్రాసు ప్రస్తావనను విరమిస్తే ఆంధ్రరాజధాని ఇక్కడే ఉండవచ్చు"

## కౌన్సిల్‌లో గవర్నరు ప్రసంగంపై చర్చలో తమిళ సభ్యుల సూచన

మద్రాసు, మార్చి 13 : మద్యనిషేధంవల్ల ప్రజలకు ఎంతో మేలు కలిగినదనీ, ఇది అనుభవంలోనికి వచ్చాక, గ్రామసీమల్లో ఆడవాళ్ళ ముఖాల్లో సంతోషం కనిపిస్తోందని చాల్ని డబ్బు కక్కుర్తికి రద్దుచేయడం అనేది ఉండదనీ మద్రాసు ముఖ్యమంత్రి చక్రవర్తి రాజగోపాలాచారి గారు నిన్న సాయంత్రం లెజిస్లేటివ్ కౌన్సిలులో గవర్నరు ప్రసంగంపై చర్చకు సమాధానంగా చెప్పారు.

… తొందని చెపితే ఆయన మానేసేవాడు, ఆయన ప్రాణం మనకు దక్కేది. కాని అల్లా జరగకపోవడం విచారకరం. కేంద్రంనుంచివచ్చిన ప్రకటన సకాలంలో రాలేదు.'

'ఆంధ్రరాజధాని ఇక్కడ ఉంటే ఏవో జరుగుతవని ముఖ్యమంత్రి చెప్పినటుల వింటున్నాము. ఇంతకాలంగా ఆంధ్రులు, తమిళులు అన్నదమ్ములవలె నివసించారు. ఇక నాల్గైదేళ్లు కలిసి ఉంటే కొంపలు మునుగుతాయా? …

శ్రీ రాజగోపాలాచారిగారు చర్చకు సమాధానంఇచ్చాక సభ 14వ తేదీ $6\frac{1}{2}$ గం. లకు వాయిదాపడింది.

## విజ్ఞప్తి

ది 16-3-53 తేదీ ఆంధ్రపత్రిక ఉగాది ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. మామూలుగా ఆదివారం ప్రచురింపబడేసారస్వతానుబంధం ఉగాది ప్రత్యేక సంచికతో పాటు ప్రచురింపబడుతున్న కారణంగా రేపటిదినం సారస్వతానుబంధం వెలువడదు.

మానేజర్.

# మీనన్ బుద్ధిపూర్వకంగా హత్యచేయలేదనిడిఫెన్సువాదం

## ఆళవందారు హత్యకేసులో సెషన్సు విచారణ ముగింపు

మదరాసు, మార్చి 13 : మదరాసు హైకోర్టు సెషన్సులో ఆళవందార్ హత్యకేసు విచారణ న్యా॥ వి. ఎస్. వి. అయ్యర్ గారి ఎదుట జరిగినపుడు డిఫెన్సు న్యాయవాది శ్రీ బి. టి. సుందరరాజను గారు 1వ ముద్దాయి తరఫున వాదనను కొనసాగించారు. 2వ ముద్దాయి మొదట ఒప్పుదల వాఙ్మూలం యివ్వటానికి నిరాకరించి తరువాత తిరిగి ఎవరి ప్రోద్బలం చేతనో వేరే ఒప్పుదల వాఙ్మూలం యిచ్చి మళ్లీ దానిని ఉపసంహరించుకోడం జరిగియున్నందువల్ల అది 1వ ముద్దాయికి ప్రతికూలంగా యేమాత్రం పరిగణింపజాలదు. 1వ ముద్దాయి ఒప్పుదల వాఙ్మూలం బట్టి చూస్తే ముద్దాయికి ఆళవందార్ మూలాన కలిగిన ఆగ్రహం బట్టి వారిద్దరు పెనుగులాడుచూ అప్పుడు ఆళవందార్‌ను ఆత్మరక్షణార్థం అతనిచేతిలో నుండిన కత్తితో పొడిచినట్లు ఒప్పుకొనియున్నాడు. రెండు నెలల క్రితమే తిన్న పెండ్లి చేసుకొన్న యువతి, వేరొయువకునితో భర్తమాచేపట్టం పరాయిమనిషి అక్కడ యే దురుద్దేశ్యంతో ఉంటున్నాడో భర్తకి తట్టకమానదనియూ అట్టి పరిస్థితియందు దురుద్దేశ్యముతో నుండిన …

… వహించాలని చేసు. శాస్త్రనిపుణులు కూడా పొరపడి అభిప్రాయం తెలుపవచ్చును—ఇదే కేసులో నరికి వేయబడిన తల మొండెము ఒక్క వ్యక్తిదే అయియుండవచ్చునని డిఫెన్సు వారు కూడా ఒప్పుకొన్నప్పటికీ ఆళవందార్ నిజంగా 42 ఏండ్లవాడై యుండినను ఆయన ఎముకలను పరీక్షచేసి అభిప్రాయం తెలిపిన డాక్టరు నిపుణులు అతని వయస్సు 24 అయియున్నదని సూచించారు-43లో గల అంకెలను వారు త్రిప్పి చెప్పినట్లు ఉంది. ఈ కేసు విషయంలో ముద్దాయి కోపావేశంతో గాని స్వరక్షణార్థం గాని నేరము చేసినట్లు మీకు సాధ్యాధారవల్లనే ద్యోతకమైతే ఆ విధంగా మీరు సెక్షను 304 క్రింద తీర్పు నిర్ధారణ చేయవచ్చును.

హత్యగావింపబడిన ఆళవందార్ వెనుక మిలిటరీలోనుండి తిరువాత జెమ్ అండ్ కంపెనీలో చౌకపెనాలను వ్యాపారం చేస్తూ అనుభవం తెలియని అవివాహితులైన ఆడపిల్లలను చౌక ఫౌంటన్ పెన్నాలు మరింత చౌకగా యిస్తాననే ఆశజూపి వారిని తనవంలో వేసుకొంటూ పలు అవివాహితు …

కొట్లాటలో ఇరువురు పైనా క్రిందా పెనుగలాడి ఆళవందార్ చేతిలో నుండిన కత్తిని అయన చేతితోనే కడుపులో పొడుచుకునేట్లు ముద్దాయి చేసి చంపినట్లు చెప్పి యున్నాడు. ముద్దాయి ఈహత్యకు అనంతరం జరిగిన దురావస్థ పనులు తమ చేసినట్లుకూడా ఒప్పుకొని యున్నాడు. పేపకికూడా ఆళవందార్ ఆరోజున తన్ను చెరచటానికి యేవిధంగా ప్రయత్నించినదీ అప్పుడు తనభర్త తరావునను ఆళవందార్‌తో తన భార్య ఉండుటయూచికోపాం చేసుకొని తన్ను క్రిందికి పొమ్మని అజ్ఞాపించి తను వచ్చి వేసిన తర్వాత వారి సువురి మధ్య యేమి జరిగినదో తనకు తెలియదని చెప్పి యున్నది.

ఆళవందార్ హత్యచేయబడిన విషయమై సాక్ష్యాధారములు పూర్తిగా నిరూపణచేసియున్నవి. ఆళవందార్ తలమొండెము తను మరుగుపరచిన సంగతిని ముద్దాయి ఒప్పుకొని యున్నాడు. వీరు యీ కేసులో ప్రాసిక్యూషను తరఫున సాక్ష్యం నొసగిన సాక్షులను ఎంతవరకు విశ్వసించదగునను విషయము మీరు బాగా ఆలోచించవలసి యుండును. తల ఆళవందార్ చనిపోయిన మీదనే నరికి యుండవలెనని అనుకోవలసి యున్నది. ఈ గాయాలు 1వ ముద్దాయియే ఆళవందార్‌కు కలుగజేసి చంపినాడని కూడా అయన వాఙ్మూలంలోనే గాక యితర సాక్ష్యాధారం వల్ల కూడా తేలుతున్నది. 1వ ముద్దాయి తన వాఙ్మూలంలో తను ఆఫీసు నుండి మధ్యాహ్నం యింటికి వెళ్లినప్పుడు ఆళవందార్‌ను అక్కడ చూచినట్లు తెలిపి యున్నాడు. ప్రాసిక్యూషను సాక్షులు చెప్పినట్లు అతను ఆరోజున …

… హారిపోయివచ్చిన యీ పనికుర్రవాడు మీనన్ యింట్లో పని మునించిన మీదకూడా ఎప్పుడూ యిల్లు వదిలి వెళ్లేవాడుకాదని ప్రతిరోజూ తన పని ముగించుకొన్న తరువాత కూడా ఇంట్లో ఒక కిటికీదగ్గరే కూర్చుంటూ కాలం గడిపేవాడని చెప్పిన విషయం ఎవరైనా నమ్మగలరా? అదీగాక యీ కుర్రవాడు ఎప్పుడూ నడిరాత్రి మునలివారిలాగా ఆల్పాచమానానికి లేవడం వాడుకయనిన్నీ ఆ రాత్రి చాలాసేపు నిద్రమేల్కొని యుండియు వానికి నిద్రపట్టక అక్కడ మీనన్ దంపతులు పలుకుచుండిన మాటలను వినుచుండెనని తెలిపిన విషయమునూ ఎవరైనా నమ్మగలరా? ఆళవందారును యింటికి రప్పించటానికి మీనన్ దంపతులు కుట్రచేశారని నిరూపించటానికే యీ సాక్ష్యం యీ విధంగా యివ్వబడిందిగాని వేరుకాదు.

అంతకుముందు ఎప్పుడూ చూడనీ ఆళవందార్ అనే వ్యక్తిని అంతోని ఆరోజు ఆయన ఆటోరిక్షాలో వచ్చి నిమ్రోజీరోడ్డు నెం. 62 ముందరదిగ్గిలోనికి వెళ్లినపుడు ఒకక్షణం మాత్రం చూచినవాడు 10 రోజుల తరువాత ఫోటోలో ఆయనను యే విధంగా గుర్తించడం సాధ్యమో అసంభవజ్ఞులైన జూరీసభ్యులు ఆలోచించాలని విన్నవించారు. ఈ విషయాలన్నిటినిబట్టి యీ హత్య బుద్ధిపూర్వకంగా ముందుగా ఆలోచించిచేసినది కాదని చెప్పటానికి యేమాత్రం సంకోచం లేదన్నారు.

# 'విద్యార్థులు ఏడాదిపాటు చదువుమానాలి'

### జయప్రకాశ్ సలహా

పాట్నా, మార్చి 12: ప్రజా సోషలిస్టుపార్టీ నాయకుడు జయప్రకాశ్ నారాయణ్ ఈ వేళ యిక్కడ (బీహారురాష్ట్ర) సర్వోదయం విద్యార్థి మహాసభ ప్రథమ సమావేశంలో ఉపన్యసిస్తూ విద్యార్థులు ఒక ఏడాదిపాటు చదువులు కట్టిపెట్టి, భూదానోద్యమ నిర్వహణలో తమ కాలాన్ని వినియోగించాలని విజ్ఞప్తిచేశారు. స్వాతంత్ర్యోద్యమం ఎంత ప్రధానమైందో ఈ భూదానోద్యమం కూడా అంత ప్రధానమైందనీ, విద్యార్థులు ఈ ఉద్యమంలో తిరగటంవల్ల అమూల్యమైన అనుభవాన్ని గడించుకొన్నవారు అవుతారనీ, జయప్రకాశ్ నారాయణ్ గారు ఉద్బోధించారు. 1954 మార్చి మాసాంతంలోగా బీహారులో 32 లక్షల ఎకరాలను సేకరించాలనే భావేగారు నిశ్చయించుకున్నట్లు ఆయన వెల్లడి చేశారు.

డా॥ కుమారప్పగారు మాట్లాడుతూ, తమ శ్రేయస్సుకోసం తను, ఆభివృద్ధికోసం ప్రజలు స్వయంగా కృషి చేయడమే సర్వోదయం అనీ, విదేశాలనుంచి వస్తువులను దిగుమతి చేసుకోవడం స్వదేశీ తత్వానికీ సర్వోదయతత్వానికీ విరుద్ధమనీ అన్నారు. కమ్యూనిటీ ప్రాజెక్టులపేరుతో అమెరికా ఇండియాలో తన ప్రాబల్యాన్ని విస్తరింప జేసుకోవాలని చూస్తున్నదనీ, ఇండియా రష్యన్ మనస్తత్వాన్ని …

### నోటీసు

ఇందు మూలముగా సమస్తమైన వారికి తెలియజేయడమేమనగా నాదాబాబు 2 ఎద్దులు సుమారు మూడు మూరల ఎత్తు కలవి అందులో ఒకటి కొంచెము పెద్దది, రెండవది కొంచెము చిన్నది, చిన్న ఎద్దు మచ్చ గలది రెండు ఎద్దులున్న చక్కని కొమ్ములుగల తెల్లయెద్దులు వీటిని కర్నూలు తాలూకా మామిళ్లపాడుగ్రామంలో నా కళ్లములో కట్టియుండగా 8—3—53 రాత్రి యెవరో విప్పుకొని పోలుకొనిపోయినారు. వాటి పత్తా తెలిపినవారికి సరియైన బహుమతి ఇవ్వగలను. ఆర్ శేషిరెడ్డి, మామిళ్లపాడు గ్రామం. కర్నూలు తాలూకా. (కర్నూలు జిల్లా)

